THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక

3/3061



Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 162 • FOUNDER . DESODHARAKA K. NAGESWARA RAO. గురువారం 13-9-1951 వెల 1 అణా, పోస్టు 0-1-2.

# రాష్ట్రంలో ఎన్నికల నిర్వహణకు ఏర్పాట్లు పూర్తి అయినవి

## నెహ్రూ సూచనకు నిరాకరణ

## రాష్ట్రనిర్మాణానికిమధ్యవర్తిత్వ పరిష్కారమేశరణ్య

## మని స్వామీ సీతారాం పునరుద్ఘాటన

గుంటూరు, సెప్టెంబరు 12: ఆంధ్రరాష్ట్ర స్థాపన జరగాలంటే మద్రాసు విభజనసంఘ నివేదికాంశాలను ఆమోదిస్తూ ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రదేశ్ కాంగ్రెసులూ, మద్రాసు ప్రభుత్వమూ సంయుక్తంగా ప్రకటనచేయాలని నెహ్రూ పెట్టిన షరతు నెరవేరేది కాదని స్వామి సీతారాం వ్యాఖ్యానించారు.

మద్రాసు పట్టణాన్ని గూర్చి తగాదాతో సహా అన్ని వివాదాలను మధ్యవర్తిత్వ పరిష్కారానికి అప్పగించటం తప్ప అన్యమార్గంలేదని స్వామీజీ పునరుద్ఘాటించారు.

ఇదివరలో ఆంధ్రకాంగ్రెస్ వారూ తదితర ప్రజాసంస్థలూ మదరాసు నగరం ఆంధ్రరాష్ట్రంలో వుండనక్కర లేదని అన్నారు. అలాంటప్పుడు మదరాసునగరం భవిష్యత్తు కూడా మధ్యవర్తి పరిష్కారాంశంగా వుండాలని కోరడంలో, మద్రాసు నగరం ఆంధ్రులకు రాకపోయినా తమిళులకు పోకుండా, 'సిటీ స్టేటు' గా వుండాలని స్వామీ సీతారాంగారి భావన అయినట్లు తెలుస్తున్నది.

తమను ప్రాయోపవేశం అనేకులు విరమించమంటూ దయాద్రహృదయులు పంపిన విజ్ఞప్తులకు సమాధానంగా, యీ తరుణంలో ప్రాయోపవేశ విరమణంవల్ల ఏ మాత్రపు ఫలితం ఒనగూడబోయేదీ అనుమానా స్పదమైన విషయమని స్వామీజీ అన్నారు. ప్రాయోపవేశ మనేది విరమించటం కానీ, పునరారంభించటం గానీ విదోషులాసాగాకి తోడిగితీసివేసి చొక్కావంటిది కాదని మనవి చేయదలిచామన్నారు. తమ ప్రాయోపవేశ విరమణాన్ని గూర్చి ఆతురతను వ్యక్తపరిచిన ప్రాజ్ఞులందరికీ, తమకు

(4-వ పేజీ చూడుడు)

### విశాఖపట్టణంలో విద్యార్థుల సమ్మె

#### స్వామి సీతారాం వుద్యమానికి సానుభూతి

విశాఖపట్టణం, సెప్టెంబరు 12: మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజి, క్వీన్ మేరీసు కాలేజి, సిటీ హైస్కూలు విద్యార్థులు నేడు ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి సానుభూతి సూచకంగా, తరగతులకు హాజరు కాకుండా సమ్మె చేశారు. విద్యార్థులు సమ్మె ఆరంభించిన కారణంగా సి. బి. ఎం. హైస్కూలుఅధికారులు స్కూలుకు నేడు శెలవు యిచ్చినట్లు ప్రకటించుకొన్నారు. విద్యార్థులు జట్లు జట్లుగా నినాదాలు చేసుకొంటూ పురవీధుల వెంట వూరేగింపులు నడిపారు. ఊరిలోని అన్ని హోటళ్లు, షాపులు పూర్తిగా మూతిపడ్డాయి.

మొన్న ఆదివారంనాడు పట్టణ సంయుక్త కాంగ్రెసు, సోషలిస్టు పార్టీ భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు (ఆంధ్రశాఖ), విశాఖ పట్టణం వర్తక సంఘం, బట్టల వర్తక సంఘం, జిల్లా రచయితల సంఘం, అఖిలాంధ్ర పుర్దూ మజ్లీస్, జిల్లా జమియత్ ఉల్ ఉలేమా, ఎంగ్ సోషలిస్టు లీగు, విద్యార్థి ఫెడరేషన్, పద్మశాలీ సంఘాల తరఫున తియ్యాలి రామశర్మ, ములుకుట్ల తిలక్ గార్లు బ్రహ్మాండమైన పౌరసభను ఏర్పాటు చేశారు. దుర్వాసుల శ్రీరామశాస్త్రిగారి అధ్యక్షతన జరిగిన యీ సభలో సత్వరమే ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించి, స్వామీ సీతారాం ప్రాణాలను కాపాడవలసినదిగా భారత ప్రభుత్వాన్ని కోరుతూ వడ్డాది బాపిరాజు, కొల్లూరి వీరభద్రరావు, బి. ఎస్. మల్లికార్జునరావు, వై. వి. కె. వల్లభరావు, శ్రీమతి జయప్రదగార్లు ప్రసంగించారు. సభవారు సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆకాంక్షిస్తూ తీర్మానాలు చేశారు. అత్యవసర సమావేశం జరిపి నెహ్రూ, ప్రసాద్ గార్లకు పరిస్థితులను గూర్చి హెచ్చరికలు చేయవలసినదిగా పురపాలక సంఘాన్ని మరొక తీర్మానం ద్వారా కోరారు. (స్వ. వి.)

## వెంటనే ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించి

## స్వామీ సీతారాం ప్రభృతుల

## ప్రాణాలను కాపాడండి

### భారత ప్రభుత్వానికి యావదాంధ్రప్రజానీకంవిజ్ఞప్తి

బళ్లారి, సెప్టెంబరు 10: ఇచటి ఆంధ్రులు, కన్నడులు రాష్ట్ర దీక్షా దినోత్సవ సందర్భాన నిన్న సంయుక్తంగా సభ జరిపి, భాషా రాష్ట్రాలను, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించుటకు వెంటనే తగు చర్య గైకొని, స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాణాలను కాపాడవలసిందిగా, భారత ప్రభుత్వాన్ని కోరుతూ ఏకగ్రీవంగా తీర్మానం చేశారు.

బళ్లారిజిల్లా కర్ణాటక ఏకీకరణ సమితి, ఆంధ్రసమితి ఆధ్వర్యాన యీ సభ జరుపబడింది. స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాయోపవేశంపట్ల సానుభూతి ప్రకటిస్తూ, యీ ప్రాయోపవేశం ఫలవంతం కావాలని ఆశిస్తూ తీర్మానింపబడింది. సభలో వ్యక్తులందరూ, కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ కాంగ్రెస్ పరిపాలనను వివరించారు. భాషా రాష్ట్రాల నిర్మాణం విషయం. శ్రీనూక్ రాజగోపాలచారి ప్రధాని నెహ్రూగారు వైఖరిని నిశితంగా విమర్శించారు.

బి. యం. శేషణ సిద్దయ్యగారి అధ్యక్షతన జరిగిన కన్నడ సభలోనూ, బళ్లారి ఆంధ్రసమితి ఆధ్వర్యాన కె. రామచంద్రరావుగారి అధ్యక్షతన జరిగిన ఆంధ్రసభలో, భాషారాష్ట్రాల నిర్మాణం కోరుతూ తీర్మానాలు చేయబడినవి.

#### హొంబయి

ఈ నగరంలోని ఆంధ్ర విద్యార్థి సంఘ సభ్యులు, యీ 9 వ తేదీ సాయంకాలం సదరు సంఘ కార్యదర్శి, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ విద్యార్థి యూనియన్ అధ్యక్షుడు అయిన బి. వి. యస్. ప్రాతుడిగారి అధ్యక్షతన సమావేశమై యీ తీర్మానం ఆమోదించారు.

"ఆంధ్ర కాంగ్రెసు నాయకులు ఆంధ్రుల ప్రత్యేకరాష్ట్రవాంఛను నెరవేర్చలేకపోయారని, తమపై పెట్టుకున్న ఆశలను, ఉంచిన నమ్మకాలను అనర్హులుగా రుజువుపరచుకొన్నారు. రాష్ట్రేతరాంధ్రుల దృఢాభిప్రాయం. ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు నాయకులు బాధ్యతలను నిర్వహించజాలరని ఆంధ్ర యువకులంతా గ్రహించాలి. ప్రస్తుత నాయకత్వంలో నూతన నైతికత్వాన్ని కల్గించేందుకు, స్వామీ సీతారాం చేస్తున్న ప్రయత్నంపట్ల మేము గాఢవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నాం. ఆంధ్రరాష్ట్ర సమస్యను ఉపనాయకులయెడ యావదాంధ్ర ప్రజల దృష్టికి తెచ్చి, వారిలో నైతిక్యం కల్గించుటలో కృతకృత్యులైనారు గనుక ప్రాయోపవేశం విరమించవలెనని, స్వామీజీ వేడుకుంటున్నాము."

#### బెంగుళూరు

మైసూరు సంస్థాన ఆంధ్ర మహాసభవారి ఆశ్రమమున యీ 9 వ తేదీ రాత్రి పి. హెచ్. జగదీశచంద్ర రాయలవారి అధ్యక్షతన జరిగిన సభలో, స్వామీ సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశం విరమించవలసిందిగా కోరారు. ఆంధ్రుల ఔన్నత్యాన్ని గురించి రాయలవారు ప్రసంగించారు. నాగాల రామమోహనరావు, ... ప్రార్థన

(4 వ పేజీ చూడుడు)





### నెహ్రూ రాజేన్ బాబులకు వినోబాభావేతంతి

వార్ధా, సెప్టెంబరు 12: సత్వర ఆంధ్రరాష్ట్ర సిద్ధికై, యిప్పటికి 28 రోజులుగా స్వామీ సీతారాం, వారి అనుచరులు సాగిస్తున్న ప్రాయోపవేశం విషయమై తాము, తమ మిత్రులు చాలా ఆందోళన పడుతున్నామని, యిందు నిమిత్తం అవసరమైన చర్య తీసుకోవాలని, ఆచార్య వినోబాభావే భారత ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూకు, రిపబ్లిక్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాదుకు తంతి విజ్ఞప్తులు పంపారు.

### భారత ప్రధానికి విజయవాడ నుండి 400 ల టెలిగ్రాములు

విజయవాడ, సెప్టెంబరు 10: సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తగు ఏర్పాట్లు చేసి స్వామి సీతారాంజీ, వారి శిష్యులు చేస్తున్న ఉపవాస వ్రతాన్ని విరమింపజేయమని భారత అధ్యక్షుని, ప్రధాన మంత్రిని, అర్థిస్తూ ఈ క్రిందివారు టెలిగ్రాములుపంపారు: పశ్చిమ కృష్ణా కాంగ్రెసు సంఘం, శ్రీయుతులు వేముల కూర్మయ్య, బసవరాజు శ్రీరంగశాయి, ఘంటసాలసీతారామశర్మ, ఆంధ్ర విద్యార్థిసమ్మేళనం. ఈపట్టణంనుంచి గతవారంలో నాలుగు వందలకుపైగా టెలిగ్రాములువెళ్లాయి.

### ఆంధ్రలో నెహ్రూ సంచారం

మద్రాసు, సెప్టెంబరు 12: ఆంధ్రదేశంలో పండిత జవహర్‌లాల్ నెహ్రూ నవంబరు నెలలో నాల్గురోజులు సంచారం చెయ్యడానికి అంగీకరించారని ఆం. ప్ర. కాం. కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ రాజుగారు తెలియజేస్తున్నారు.

### బ్రిటన్‌కు పర్షియా సందేశం

టెహరాన్, సెప్టెంబరు 12: అమెరికా అధ్యక్షుని ప్రతినిధి హారిమన్ ద్వారా బ్రిటనుకు ఆఖరి సందేశం పంపడానికి మరి మూడురోజుల వరకు వాయిదా వేయడానికి పర్షియా ప్రధాని డా॥ మహమ్మద్ మొసాదిక్ నిశ్చయించినట్లు ఇక్కడి పర్షియన్ వర్గాల వారివల్ల తెలుస్తున్నది.

### కొత్రగడ్డ రాజగోపాలరావు ప్రభృతి డిటెన్యూల విడుదల

మద్రాసు, సెప్టెంబరు 12 డిటెన్యూలుగా ఉన్న శ్రీయుతులు కొత్రగడ్డ రాజగోపాలరావు, నారపాటి సత్యనారాయణ, మానికొండ సుబ్బారావు డి. వి. అప్పారావు ప్రభృతులు 16 మంది హెబియస్ కార్పస్ దరఖాస్తులను అంగీకరిస్తూ వారి విడుదలకు మద్రాసు హైకోర్టు సెప్టెంబరు 10 వ తేదిని ఉత్తర్వుచేసినది. న్యాయమూర్తి మాక్, న్యాయమూర్తి సోమసుందరంగారలు వారి దరఖాస్తులపై విచారణజరిపి, పై విధంగా తీర్పు చెప్పారు.

## తక్షణం ప్రాయోపవేశం విరమించండి: స్వామిసీతారాంకు ప్రముఖుల విజ్ఞప్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అనువైన వాతావరణం యేర్పడింది, కనుక తక్షణ ప్రాయోపవేశంవిరమించండి అని అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావు గారు స్వామీ సీతారాం గారికి తంతిద్వారా విజ్ఞప్తి పంపారు. వెంకట్రావు గారు తమ విజ్ఞప్తిలో యిలా తెలియజేశారు.

ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించుటకు ప్రాముఖ్యం నేనుంచు, ఆంధ్ర తమిళ కర్ణాటక ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలు, మద్రాసు ప్రభుత్వము, విభజన సంఘ నివేదిక ప్రకారం ఒక సమాధానానికి రావాలని ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ సూచించారు. ఈ 14 వ తేదీన నెల్లూరులో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం సమావేశమై, మీ కోర్కెను బలపరుస్తుందని, రాష్ట్ర నిర్మాణానికి తగిన ప్రాతిపదికను యేర్పాటు చేస్తుందని మీకు హామీ యిస్తున్నాను.

తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజ నాడార్ గారు, ప్రధాని నెహ్రూను స్వయంగా కలుసుకొని, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఏ చర్య గైకొనినా, తమిళనాడు కాంగ్రెసు సంఘం సంపూర్ణంగా సహకరిస్తుందని చెప్పారు. కర్ణాటక కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్పగారు సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై తమకు ఏవిధా అభ్యంతరం లేదని చెప్పారు. విభజనసంఘ సిఫార్సులపై యిప్పటికే చర్యకు శపించవచ్చు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు యిందుకు తగిన ప్రాతిపదిక యేర్పాటు చేయవచ్చు.

"మీరు కేవలం రాష్ట్రనిర్మాణ సమస్యపైనే ప్రాయోపవేశం చేస్తున్నారని, యితర వివరాలపై గాదని, భావిస్తున్నాను. సందుకంటే యీ వివరాల విషయమై మనలో మనకే అభిప్రాయభేదా లున్నవి గనుక, నా భావనే సరియైతే, మీ ప్రాయోపవేశం ఫలప్రదమైనదనే చెప్పవచ్చు. ఆంధ్రరాష్ట్ర సమస్యపై అందరు తమ దృష్టిని కేంద్రీకరించునట్లు చేయడమే గాక, ఒకవిధంగా ప్రధానమంత్రి ఆశించిన ఒప్పందంగూడా కుదిరింది. పైన పేర్కొన్నట్లు, తమిళ కర్ణాటక నాయకులు సంపూర్ణ సహకార మిచ్చెదమని స్పష్టీకరిస్తు ఆంధ్రరాష్ట్ర సమస్యా పరిష్కారానికి చేయూత యిస్తున్నారు. రాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన వివిధ పథకాలమధ్య ఖచ్చితమైన ఒప్పందిక సాధించుటకు కొద్ది రోజుల్లోనే నిర్దిష్టమైన చర్యలు తీసుకోబడును."

#### వెంకట్రావు గారికి నిజలింగప్ప లేఖ

వెంకట్రావుగారికి నిజలింగప్ప యీ లేఖ వ్రాశారు. "భాషా రాష్ట్రాల నిర్మాణానికి కేంద్రప్రభుత్వం పూనుకోవాలని అర్థిస్తూ రోజూ కర్ణాటకులు నలుమూలలనుంచి, నాకు లేఖలు, తంతులు వస్తున్నవి. మైసూరుప్రజాభిప్రాయాన్ని స్పష్టంచేస్తుకూడా విజ్ఞప్తులు వస్తున్నాయి.

స్వామీ సీతారాం ఉద్యమంపట్ల కర్ణాటకం గాఢమయిన సానుభూతి కనపరుస్తున్నది. ఆయన ప్రాణానికే ప్రమాదం ఘటిల్లుతుందో అని మేమంతా ఆందోళనపడుతున్నాము. నిజంగా ఆయనప్రాయోపవేశం భాషారాష్ట్రాల విషయంలో, ప్రజల గాఢమయిన వాంఛకు చిహ్నం.

సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అభ్యంతరం ఉంటుందనుకోను. విభజనసంఘ నివేదిక సిఫార్సులపై ఇప్పటికైన చర్య తీసుకోవచ్చు. పరిష్కర్తుల సమస్య అంతే క్లిష్టమయినది గాదు. వివాదగ్రస్త ప్రాంతాలుగూడా అంత విశాలమయినవి గావు. ఈ వివాదప్రాంతాలను పరిష్కర్తలు నిష్పక్షపాతంగా తీర్పు చెప్ప

[4 వ పేజీ చూడుడు]

## జనవరి 2 నుంచి 25 వరకూ జరగ్గలవని ఆర్థికమంత్రి వివరణ

### ప్రతి 750 వోటర్లకూ పోలింగు స్టేషన్: ఏ వోటరూ 3 మైళ్లకు మించి రానవసరంలేదు

మదరాసు, సెప్టెంబరు 12: "ఈ రాష్ట్రమునకు చెందిన అసెంబ్లీ, పార్లమెంటరీ నియోజకవర్గములనుండి సభ్యులను ఎన్నుకోవాలని నవంబరు 7 వ తేదీనప్రకటిస్తాము. పోలింగ్ 1952 జనవరి 2 న ప్రారంభమై 25 వ తేదీకల్లాపూర్తిఅవుతుంది. నవంబరు 21 వ తేదీ నామినేషనుల స్వీకరణకు ఆఖరుతేదీగ నిర్ణయం కావచ్చును. నూతన అసెంబ్లీ సభ్యులచే లెజిస్లేటివు కవున్సిల్ సభ్యుల ఎన్నిక 1952 ఫిబ్రవరి మధ్యలో ఆరంభమై 1952 మార్చి 18 వ తేదీకి పూర్తిఅవుతాయి"ని ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు నేడు నెలసరి పత్రికావిలేఖరుల గోష్ఠిలో వెల్లడించారు.

ఎన్నికల కార్యక్రమము గూర్చిన వివరాలనుగూడా మంత్రిగారు తెలియజేశారు.

మదరాసు లెజిస్లేటివు కవున్సిల్లోని స్థానికసంస్థలు, పట్టభద్రులు, ఉపాధ్యాయుల నియోజకవర్గములకు ఎన్నిక పోస్టలు బాలెటుద్వారా జరుపుటకు మదరాసుప్రభుత్వం సుముఖత వెల్లడించిందనియూ, కని విని ఎరుగని వమోజన ఓటింగ్ పద్ధతిపై ఎన్నికలకు సర్వసన్నాహాలు సకాలములో పూర్తి కాగలవని శ్రీగోపాలరెడ్డిగారన్నారు.

#### నూతన మంత్రివర్గ నిర్మాణం

ఈ కార్యక్రమును అనుసరించి నూతన మంత్రివర్గం 1952 ఏప్రియల్ 1 తేదీకి ఏర్పడవచ్చని మంత్రిగారు సూచించారు.

#### ఎన్నికల కార్యక్రమం

పోలింగ్ కేంద్రాలు, ఎన్నికల విధానముగూర్చి విరివిగా ప్రచారం చేయవలెనని కలెక్టర్లకు వుత్తర్వు ఇచ్చాం. ఈ వివరాలు రాజకీయపార్టీలకు సప్లయిచేసి గడువులోగా వచ్చే ఆక్షేపణలను పరిశీలించి నికరం చేస్తారు. మామూలుగా ఒక్కొక్క పోలింగ్ బూత్ కు 750 ఓటర్లు వుంటారు. ఓటరు 3 మైళ్లకు మించి ప్రయాణం చేయవలసిన ఆవశ్యకత వుండదు. గిరిప్రాంతాలు, ఏజన్సీలో తప్ప పోలింగ్ కేంద్రంలో స్త్రీ పురుషులకు పోలింగ్ బూత్‌లు విడివిడిగా వుంటాయి. పర్దాస్త్రీలకు ఉద్దేశించిన బూత్‌లలో సిబ్బంది యావత్తూ స్త్రీలుగనే ఉంటారు.

మదరాసు లెజిస్లేటివు అసెంబ్లి, హౌస్ ఆఫ్ పీపుల్స్ (ప్రజాప్రతినిధి సభ)కు ఎన్నికలు ఏకకాలమందు జరుగుతాయి. ఎన్నిక 9 రోజులమీద ఈ క్రింది కార్యక్రమము ప్రకారం జరుగుతుంది.

#### పార్లమెంటు నియోజకవర్గం పేర్లు

2-1-52:—రాజమండ్రి, ఒంగోలు బళ్లారి, నెల్లూరు, కడలూరు, మధుర, కెనరా (ఉత్తరం) పొన్నాని.

5-1-52:—నరసారావుపేట, నెల్లూరు, కర్నూలు, వందవాసి, దిండివనం, శ్రీవిల్లిపుత్తూరు.

8-1-52:—విశాఖపట్నం, గుంటూరు చెంగల్పట్, కాంచీపురం, కృష్ణగిరి, కోయంబత్తూర్, అరకుకోట్టె, రామనాథపురం, ద. కెనరా (దక్షిణం) మల్లాపురం.

9-1-52:—అనంతపురం, మయూరం.

11-1-52:—తెనాలి, తిరువళ్లూరు, ధర్మపురి.

12-1-52:—విజయనగరం, కాకినాడ, పెనుకొండ, పొలాచి, తంజావూరు, శ్రీవైకుంఠం, దిండిగల్, కోజికోడ్.

16-1-52:—శ్రీకాకుళం, గుడివాడ, విజయవాడ, నంద్యాల, మదరాసు, సేలం, తిరుప్పూరు, పుదుకోట, కుంభకోణం, తిరునెల్వేలి, పెరియాకుళం, తెల్లిచేరి.

21-1-52:—పార్వతీపురం, ఏలూరు, కడప, తిరుపతి, తిరుచెంగోడ్, తిరుచిరాపల్లి, శంకరనాయినార్ కోయిల్, కన్ననూర్.

25-1-52:—పాలెపట్నం, మచిలీపట్నం, చిత్తూరు, ఈరోడ్, పెరంబలూర్.

ప్రతి పార్లమెంటరీ నియోజక వర్గములోని అసెంబ్లీ నియోజక వర్గంలోనూ ఏకకాలమందు పోలింగ్ జరుగుతుం దన్నారు.

ఈ ఎన్నికల్లోనూ తన విషయమే మన ఓటరుకు బాలెటుపత్రం ఇచ్చేముందు ఓటరు ఎడమచేతి చూపుడు వేలికి చెరగని సిరా అంటించెదరు ఈ సిరా, దాదాపు మూడు వారాల వరకు చెరగదు. ఇందువలన ఒకరే మరల మరల వచ్చి ఓటు చేయుటకు వీలుపడదని మంత్రిగారన్నారు.

#### నియోజక వర్గాలు

పార్లమెంటు సవరించిన రీతిన పార్లమెంటరీ అసెంబ్లీ నియోజక వర్గాల విభజన వుత్తర్వు ఇండియా ప్రభుత్వ గెజెటులో ప్రకటించబడింది. వీనికి విరివిగా ప్రచారము ఇచ్చుటకుగాను రాష్ట్రగెజెటులో ప్రకటించుటకు ఏర్పాటు జరిగింది. (ఈవారంగెజెటులో ప్రకటించబడ్డాయి) ఈ కాపీలు ప్రజా సామాన్యమునకు సులభముగా అందుటకు ప్రత్యేక ఏర్పాట్లు జరుగుతున్నాయి. లెజిస్లేటివు అసెంబ్లీకి 243 ఏకసభ్య నియోజక వర్గాలు, 66 జంట నియోజక వర్గాలు, ప్రజాప్రతినిధి సభకు 49 ఏకసభ్య నియోజక వర్గాలు 13 జంట నియోజక వర్గాలు వున్నాయి. కవున్సిల్ ఎన్నికలకు సంబంధించి అధ్యక్షుని నియోజకవర్గముల వుత్తర్వు జరుగుతున్న పార్లమెంటు సమావేశంలో జారీ కావచ్చని శ్రీగోపాలరెడ్డి గారన్నారు.

#### ఎన్నిక నిబంధనలు

ఎన్నికలకు సంబంధించిన ప్రజాప్రాతినిధ్యపు చట్టమును మదరాసు గెజెటులో పునర్ముద్రించాం. సదరు చట్టంక్రింద నియమములు ఇంకా రాలేదు. వానిని గూడా గెజెటులో ప్రకటించవలసి వుంటుంది. రూల్సును ప్రాంతీయభాషలలోకి తర్జుమాచేసి జనసామాన్యానికి అందుబాటు చేస్తారు ఎన్నికలకు అభ్యర్థులుగా వుండేవారు అనుసరించవలసిన విధానమును క్రోడీకరించి విశదం నిమిత్తం ఒక ప్రచురణ చేయవలసిందని మంత్రిగారు తెలిపారు.

(2-వ పేజీ చూడుడు)

## జనరల్ రిడ్జివే ప్రతిపాదనకు కమ్యూనిస్టుల నిరాకరణ

### యుద్ధవిరమణ సంభాషణల ప్రదేశం మార్పు అంగీకారయోగ్యం కాదట

టోకియో, సెప్టెంబరు 11: కేసాంగులో కాక మరొక కొత్త ప్రదేశంలో కొరియాయుద్ధ విరమణ సంభాషణలు కొనసాగించాలంటూ సమితి సర్వసైన్యాధిపతి జనరల్ రిడ్జివే ఇటీవల ఒక ప్రతిపాదనచేశారు. ఆ ప్రతిపాదన ఎంతమాత్రము సంతృప్తికరంగా లేదనీ, తమకు అంగీకారయోగ్యమైనది కాదనీ కమ్యూనిస్టు సైన్యాధిపతులు జనరల్ కిమ్‌ఇల్ సుంగ్, జనరల్ పెంగ్ టెహువాయ్ ఈ రోజున తెలియపరచారు.

జనరల్ రిడ్జివేకు వారు పంపిన లేఖలో ఇంకా ఇలాఉన్నది:- "తటస్థ ప్రాంతంపై తమయుద్ధ విమానాలు దాడులుజరపకుండా సమితిఅధికారులు నిరోధించలేదు. ఇట్టి పరిస్థితిలో ప్రపంచంలో ఏప్రదేశంలో సంభాషణలు కొనసాగించినా, సమితి యుద్ధ విమానాలు దానిపై దాడి జరపకుండా ఉంటాయనే హామీలేదు." కమ్యూనిస్టులు సైన్యాధిపతులు తమలేఖలో కేసాంగుప్రాంతపు తాటస్థ్యానికివిరుద్ధంగాసమితిబలాలు జరిపినదాడులనువివరించారు. వాటన్నిటికీ జనరల్ రిడ్జివే బాధ్యత వహించాలని కూడా వారు సూచించారు.

#### కమ్యూనిస్టుల ఆరోపణ

లండన్, సెప్టెంబరు 11: అమెరికనులు కొనసాగించిన దురాక్రమణ చర్యల ఫలితంగానే కొరియా యుద్ధవిరమణ సంభాషణలు భగ్నమయ్యే పరిస్థితి ఏర్పడినదని ఉత్తరకొరియా కేంద్ర టంతి సంస్థ నేడు ప్రకటించినది. ఆ సంస్థ ప్రకటనలో ఇంకా ఇలా ఉన్నది:— "కేసాంగు సంభాషణలను అమెరికనులు విరమించడానికి గల కారణాలు ఇవి:—(1) కొరియా యుద్ధంలో వరుసగా అపజయాలు సంభవించిన కారణంగా యుద్ధరంగానికి సహాయ సైన్యాలు, కొత్త యుద్ధ పరికరాలు పంపడానికి అమెరికనులకు కొంత వ్యవధి అవసరమైనది. (2) కొరియాలో అమెరికనుల దురాక్రమణ అంతం కావాలనే ప్రపంచ ప్రజల ఆందోళన మరింత బలపడినది. (3) దురాక్రమణదారుల అపజయాల ఫలితంగా అమెరికా, బ్రిటన్, తదితర దేశాలమధ్య విభేదాలు ఏర్పడినవి. కొరియా యుద్ధం అంతం కావాలని ఆ దేశాలు కోరుతున్నవి. కేసాంగు సంభాషణలు విరమించడంవల్ల యుద్ధం విస్తృతం చేయడమే 'అమెరికనుల లక్ష్యమని ఋజువు అవుతున్నది."

#### కేసాంగుపై అమెరికన్ విమానం దాడిచేసినట్లు అంగీకారం

టోకియో, సెప్టెంబరు 11: కేసాంగు తటస్థ ప్రాంతంపై ఒక అమెరికన్ యుద్ధ విమానం నిన్న దాడి చేసినట్లు సమితి ప్రతినిధివర్గ నాయకుడు వైస్ అడ్మిరల్ జాయ్ నేడు అంగీకరించారు, సమితి అధికారుల పరిశోధన ఫలితంగా ఆ విషయం ఋజువు అయినది. ఆ దాడికి బాధ్యుడైన వైమానికునిపై తగిన చర్య జరుపుతున్నట్లు అడ్మిరల్ జాయ్ కమ్యూనిస్టులకు తెలియపరిచారు. కమ్యూనిస్టులు చేసిన తక్కిన్ని ఆరోపణలను మాత్రం ఆయన నిరాకరించారు.

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ త్రయోదశి 1951 సం॥ సెప్టెంబరు 13 గురువారం శు॥ త్రయోదశి రా 10-16 శ్ర ఉ 6-12 ధని తె4-36 వర్జ్యం ప 9-55 ల11-25కు. శు॥ చతుర్దశి సెప్టెంబరు 14 శుక్రవారం శు॥ చతుర్దశి రా 8-3 శత రా 8-18 దు॥ కాలం ప 11-23 ల 12-58 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకు నెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ త్రయోదశి

గురువారం


## ప్రజలు - ప్రాజెక్టులు - రాష్ట్ర ప్రభుత్వము

రాష్ట్రపబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి భక్తవత్సలంగారు క్రిందటి సంవత్సరం అసెంబ్లీబడ్జెటు సమావేశంలో కృష్ణా-పెన్నారు ప్రాజెక్టు ప్రాధాన్యాన్ని దీర్ఘంగా వివరించారు. రామపాద సాగరు ప్రాజెక్టుకంటే ఈ ప్రాజెక్టు ఎక్కువ ప్రయోజనకరమైందనీ, దీని నిర్మాణం చాలా సులభమైందనీ, వీలును, ఆర్థికస్థితినిబట్టి దశలు, దశలుగా నిర్మించుకోవచ్చునని ఇందుకు మన ఇంజనీరులే చాలనీ మంత్రిగారు కొంతకాలంగా ప్రచారం చేస్తూవచ్చారు. ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు భక్తవత్సలంగారికి పూర్తిగా సహాయపడినారు. వీరిరువురి సంయుక్తకృషే కృష్ణా-పెన్నారు ప్రాజెక్టు పథకం: ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయితే దాదాపు 45 లక్షల యెకరాలపంటకు నీరు సప్లయి అవుతుంది. ఇందుకు ఖర్చు కూడా 135 కోట్ల రూపాయలకంటె ఎక్కువకాదు. భక్తవత్సలంగారు పోయిన సంవత్సరం నూరు కోట్లే అవుతుందన్నారు కూడా!

అయితే అసలు ఈ ప్రాజెక్టు అనుకున్నప్పుడు ఒక విధంగానూ, ఇప్పుడు మరోవిధంగానూ, పూర్తి కాబోయేసరికి మరోకవిధంగానూ ఉంటుంది. కృష్ణా - పెన్నారు ప్రాజెక్టు అంటే ఇది అని ఖచ్చితంగా చెప్పడం అధికారంలో లేని వారికి సాధ్యంగాకుండా వుంది. కాబట్టే మూడేళ్ళక్రితం రామపాదసాగరు ప్రాజెక్టా? కృష్ణా పెన్నారు ప్రాజెక్టా? ఏదికావాలని ప్రశ్న వస్తే మన నాయకులు చాలామంది కృష్ణా - పెన్నారు ప్రాజెక్టే కావాలని ఉన్నారు. అంతకుముందు రాయలసీమలో ముఖ్యంగా కడపజిల్లాలో ఈ ప్రాజెక్టుకు తీవ్ర ప్రాతికూల్యం ఉంది. క్రమంగా ఆ ప్రాతికూల్యం లొగ్గింది. అసలు ఆ రోజుల్లో కడప జిల్లావారు ఈ కృష్ణా-పెన్నారు మానివేసి రామపాదసాగరు ప్రాజెక్టే నిర్మించమనికూడా ఆందోళనచేశారు. ఇదంతా మారిపోయింది. అప్పట్నుంచి క్రిందటి సంవత్సరంవరకూ ఆంధ్ర నాయకులందరూ కృష్ణా-పెన్నారుకు అనుకూలంగా ఉన్నారు. ఈ ప్రాజెక్టును తక్షణం ప్రారంభించాల్సిందని రామపాదసాగర్ సర్వస్తుతం అక్కర్లేదని ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూకు ఉత్తరాలు కూడా వ్రాశారు.

ఈ సంవత్సరం పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

కృష్ణా పెన్నారు ప్రాజెక్టును ప్రస్తుతానికి నిలిపివేసి పులిచింతల ప్రాజెక్టును వెంటనే మొదలుపెట్టాలనే ఆందోళన ప్రారంభమైంది. ఈలోపున రాష్ట్ర ప్రభుత్వంవారు కృష్ణా, పెన్నారు ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన ప్రాతిపదిక చర్యలన్నింటిన్నీ తీసుకుంటున్నారు. ఈ ప్రాజెక్టునిర్మాణంయెప్పుడు ప్రారంభమైనా, ప్రారంభమైన నాటినుంచి పూర్తికావడానికి 15 సంవత్సరాలకు తక్కువపట్టదు. ఈ పదిహేను సంవత్సరాల్లో మరో పెద్దప్రాజెక్టును ప్రారంభించడానికి ఈ రాష్ట్ర ప్రభుత్వానికి- ఇప్పటిలాగా ఉమ్మడిగానే ఉన్నా-డబ్బు ఉండదు. ఈ ప్రాజెక్టు పూర్తి అయింతరువాత కృష్ణానదినీటిని ఉపయోగించుకునేందుకు, మరెక్కడా ప్రాజెక్టు నునిర్మించుకునే అవకాశం లేదు. ఇటీవల ఈ కృష్ణానది నీటిపంపకం గురించి ఢిల్లీలో బొంబాయి, మద్రాసు, హైదరాబాదు, మైసూరు ప్రభుత్వాలకు జరిగిన ఒప్పందంప్రకారం మనకు 47 వంతులు నీరు మాత్రం వస్తుంది. హైద్రాబాదు, మనం కలిస్తే దాదాపు ముప్పాతిక నీరు లభిస్తుంది.

హైద్రాబాదు ప్రభుత్వం కృష్ణానదిమీద రెండు డాములు కట్టడానికి నిర్ణయించుకుంది. అందులో ఒకటి ఎగువ కృష్ణా డాము, ఇది భీమానది కృష్ణలో కలవడానికి ముందు రాయచూరు జిల్లాలో ఉంటుంది. రెండవది దిగువ కృష్ణా ప్రాజెక్టు. మూసీనది కృష్ణాలో చేరడానికి ముందు నల్గొండ జిల్లాలో ఉంటుంది. 1945 వ సంవత్సరంలో ఈ రాష్ట్ర ఇర్రిగేషన్ శాఖ పరిపాలనను గురించిన ప్రభుత్వ నివేదికలో పులిచింతలవద్ద కృష్ణానది మీద ఒక డాము కట్టడానికి ఆలోచన ఉన్నట్లు తెలియజేయ బడింది. అలాగే మైసూరు ప్రభుత్వం భద్రానదిపై లక్కవల్లి వద్ద ఒకడాము నిర్మించ దలచింది.

ఈ ప్రాజెక్టులన్నీ పూర్తిఅయితే కృష్ణా-పెన్నారు ప్రాజెక్టు అసలు విచారణకే రాదు. కృష్ణా పెన్నారుప్రాజెక్టు సాగాలంటే ఈ ప్రాజెక్టులన్నింటిన్నీ వదులుకోవాల్సిందే. కృష్ణానదీ నీటిపంపకం నిర్ధారణ అయిన తరువాత ఈ ప్రాజెక్టు నిర్మాణంలో ఉన్న ప్రమాదాలు ఆంధ్రులకు స్పష్టంగా బోధపడ్డాయి. అప్పట్నుంచే పులిచింతల ప్రాజెక్టు నిర్మాణానికి వెంటనే రాష్ట్రప్రభుత్వం పూనుకోవాలనే ఆందోళన ప్రారంభమైంది ఈ ప్రాజెక్టు నిర్మాణానికి రాష్ట్రప్రభుత్వం ఈ క్షణంలో పూనుకున్నా పూనుకోకపోయినా, ఇలాంటి ఇతర ప్రాజెక్టుల నిర్మాణావకాశాలను పూర్తిగా తొలగించివేసే కృష్ణా- పెన్నారుప్రాజెక్టు నిర్మాణాన్ని మాత్రం ప్రస్తుతానికి విరమించాలి.

రామపాదసాగరం పూర్తి అయి, గోదావరి జలం కృష్ణలోకి వస్తేతప్ప కృష్ణా నీటిని నెల్లూరువద్ద పెన్నారులోకీ, అక్కడ్నించి దక్షిణ ఆర్కాటు జిల్లాలో పల్లార్ నదిలోకి తీసుకుపోవడానికి ఎంతమాత్రం వీల్లేదు. ఈ ప్రాజెక్టువల్ల ఆంధ్రులకుగాక ఆంధ్రేతరులే ఎక్కువగా లాభం పొందుతారనే భావం కూడా ఆంధ్రుల్లో ఎక్కువగా ఉంది. ఇది కేవలం ఊర్వ్యాజనితం కావడానికి ఇప్పటి ప్లానింగ్ కమిషనువద్దకు ఆంధ్రేతరులు ప్రభృతులు రాయబారం వెళ్లడమే ఆధారం. భక్తవత్సలంగారు అన్నట్లు చిత్తూరు, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు జిల్లాలే ఎక్కువగా ఈ కృష్ణా - పెన్నారు ప్రాజెక్టువల్ల లాభిస్తే, ఆ ప్రాంతాలకు చెందినవారిలో ఒక్కరుకూడా ఈ రాయబారంలో ఎందుకు లేరు?

రాష్ట్రప్రభుత్వం కృష్ణా-పెన్నారు ప్రాజెక్టుకు ఇంత ప్రాధాన్యం ఎందుకు యిస్తున్నదో ప్రభుత్వ చీఫ్ ఇంజనీరు వెంకటాచారిగారు 1951 జనవరి 26 వ తేదీన ప్రభుత్వం ప్రచురించిన 'మద్రాసు' గ్రంథంలో వ్రాసిన వ్యాసం స్పష్టంగా వెల్లడిస్తుంది. "ఈ రాష్ట్రంలో వున్న కావేరీ, తామ్రపర్ణిలాంటి నదుల నీటిని పూర్తిగా వినియోగించుకుంటున్నాము. ఇక ఆ నదులపై చేయగల్గింది ఏమీ లేదు. కృష్ణా, గోదావరి, సర్కారు జిల్లాలలో ఉన్న మరికొన్ని ఇతర నదుల నీటిని సద్వినియోగం చేయడానికే ఇకమీదట తీవ్ర కృషి చేయవలసి వుంటుంది." కనుక కృష్ణానది నీటిని చంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు జిల్లాలలో వ్యవసాయానికి తీసుకు వెళ్లడం అత్యవసరమైంది. ఆ అవసరం తీర్చుకోవడంలో ఆంధ్రజిల్లాలు కొన్ని లాభించడం కేవలంకాకతాళీయమే! అసలు రహస్యం ఇది కాబట్టే మేము మొదట్నుంచీ కృష్ణా - పెన్నారు ప్రాజెక్టు నిర్మాణానికి విముఖులుగా ఉంటూ వచ్చాము. పులిచింతల ప్రాజెక్టు నిర్మాణం కృష్ణా, గుంటూరు జిల్లాలకూ, ఆ ప్రాజెక్టును విస్తరిస్తే మరి రెండు జిల్లాలకూ నీరు సప్లయికి వసతు కల్పించడానికి, ఈకృష్ణా పెన్నారు ప్రాజెక్టును, రామపాదసాగరు ప్రాజెక్టు పూర్తి అయ్యేవరకూ వాయిదా పడేందుకు ఉపయోగపడుతుంది గనుకనే ఆంధ్రులు ఈనాడు ఈ ప్రాజెక్టునుగురించి ఇంతగా ఆందోళన చేయుచున్నారు.

పులిచింతల ప్రాజెక్టును పూర్తిగా విరమించ లేదని మంత్రి భక్తవత్సలంగారు మొన్న పత్రికా విలేఖరుల సభలో ప్రకటించారు. అంతేగాదు. దానికి సంబంధించిన విచారణ ఏమీ జరుగ లేదు గనుక ఈ ప్రాజెక్టును కన్నెత్తి అయినా చూడలేదని చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వవైఖరి ఎలా ఉందీ ఇదివరకే ఒక ప్రకటన ద్వారా వివరింపబడింది ఇప్పుడు కేంద్ర ప్రభుత్వవైఖరి ఎలా వుంటుందో మంత్రిగారు చెప్పారు. ఈ విధంగా ఆంధ్రులకు కర్తవ్యాన్ని బోధించినందుకు మంత్రిగారికి ఆంధ్రులు కృతజ్ఞులు.

అయితే ఈ విధంగానే కృష్ణా, పెన్నారు ప్రాజెక్టుకు సంబంధించిన యావత్తు వివరాలను ఎలాటి దాపరికం లేకుండా మంత్రిగారు ప్రకటించజేస్తే ఆంధ్రులు సంతోషిస్తారు. ఈప్రాజెక్టును కృష్ణపై సిద్ధేశ్వరంవద్ద ఒకరెజర్వాయరు కడతారు. ఇది మెట్టూరు రెజర్వాయరు అంత ఉంటుందని 1950 లో భక్తవత్సలంగారు చెప్పారు. కాని మెట్టూరు రెజర్వాయరుకు ఇది మూడునాల్గు రెట్లు ఉంటుందని చీఫ్ ఇంజనీరు వెంకటాచారిగారు అన్నారు. ఇందులో ఏది నిజమో తెలియదు. పెన్నారు నదిమీద సంగం దగ్గర కట్టే రెజర్వాయరు విషయంలో మాత్రం ఇద్దరూ అది మెట్టూరు రిజర్వాయరుకు మూడు నాలుగు రెట్లు ఉంటుందని అన్నారు. అధికార వర్గాలల్లో ఇన్ని తప్పిళ్ళు ఉంటంవల్లనే అఖరుకు ఈ కృష్ణా-పెన్నారు ప్రాజెక్టు ఎలాటియారవుతుందో పబ్లిక్ సామాన్యానికి తెలియకుండా ఉంది.

పెన్నారు నదిమీద ఇప్పటికే సంగంవద్ద నెల్లూరువద్ద రెండు ఆనకట్టలున్నాయి. కొత్తగా ఎగువ పెన్నారు ప్రాజెక్టుఒకటి, పెన్నారు - కుముద్వతీ ప్రాజెక్టు ఒకటి నిర్మించడానికి ప్రభుత్వం సంకల్పించింది. ఈ పరిస్థితుల్లో గండికోట రిజర్వాయరుకు పెన్నారునుండి నీరు లభించదు. అందుకు కృష్ణనుంచి పెన్నారుకు నీరు తీసుకురావాలి. అంతవరకే అయితే ఆంధ్రులకు అభ్యంతరం లేదు. ఈ ప్రాజెక్టు ఏర్పడినా పులిచింతల ప్రాజెక్టును ఏర్పరచుకోవచ్చు. కాని మద్రాసు ప్రభుత్వ విధానం ఎలా ఉందీ అంటే ఆంధ్ర జిల్లాలో యేప్రాజెక్టు అయినా కొందరు కావాలీ అంటే అది కాదు మరొకటి కావాలి అని మరికొందరు ఆందోళన చేయడానికి దోహదం చేసేదిగా ఉంది. రామపాదసాగరం, కృష్ణా-పెన్నారు, గండికోట రిజర్వాయరు, పులిచింతల ప్రాజెక్టుల విషయంలో మేము వివరించిన ఈ విషయాలన్నీ కూడా రాష్ట్రప్రభుత్వ ద్వంద్వ విధానాన్నే నిరూపిస్తున్నవి.

## ఎన్నికల నిర్వహణకు ఏర్పాట్లుపూర్తిఅయినవి

(1 వ పేజీ తరువాయి)

ఎన్నికల కమిషన్ ఇంతవరకు 13 అఖిలభారత రాజకీయపార్టీలకు సంకేతాలను నిర్ణయించారు. రాష్ట్రపార్టీలకు రాష్ట్రప్రధాన ఎన్నికల అధికారి నిర్ణయించాలని ఎన్నికల కమిషన్ ఆదేశించింది. ఆవిషయమై త్వరలో సమావేశం ఏర్పాటుచేసి నిర్ణయించదలచినని మంత్రిగారన్నారు.

### ఓటర్ల జాబితాలు

నికర ఓటర్ల జాబితాల ప్రచురణ పూర్తి అయింది. తాలూకా సబ్ తాలూకా వారిగా గాక నియోజక వర్గముల వారీగా ప్రకటించవలసివుంది. రిజిస్ట్రేషన్ ఆఫీసర్ల జాబితా ఎన్నికల కమిషన్ ఆమోదం కొరకు పంపబడింది అందులో అసెంబ్లీ నియోజక వర్గానికి తహశీల్దార్ లేక డిప్యూటీ తహశీల్దార్ పార్లమెంటరీ నియోజక వర్గానికి రివిన్యూడివిజనల్ ఆఫీసరును ఎన్నికల రిజిస్ట్రేషన్ ఆఫీసరుగా సూచించియున్నాం. నికరఓటర్ల జాబితాలను ఎన్నికల రిజిస్ట్రేషన్ ఆఫీసర్ల కార్యాలయంలో ప్రకటిస్తారు. ప్రాథమిక జాబితాలను ప్రకటించిన చోటనే నికరజాలను ప్రకటించుటకు ఎన్నికకమిషన్ అనుమతికోరియున్నారన్నారు.

### ఓటర్ల జాబితాల ఖరీదు

ఈ రాష్ట్రంలో సుమారు 2 కోట్ల 70 లక్షల ఓటర్లున్నారు. అసెంబ్లీ నియోజక వర్గం ఓటర్ల జాబితా ఖరీదు తెలుగులో 15-6-0 పార్లమెంటునియోజక వర్గం జాబితా ఖరీదు 76-14-0 లు అవుతుందన్నారు.

పార్లమెంటు సభ్యత్వ ఎన్నికబాలెటు పెట్టెకు ఆకుపచ్చ, అసెంబ్లీ ఎన్నికబాలెటు పెట్టెకు చాకొలెట్ (తోపు) రంగు నిర్ణయించ బడింది. ప్రతిపోలింగుకేంద్రంలో రెండు బూత్ లుపుంటాయి. ప్రతి ఒక్క బూత్ కు సుమారు 4 గురు మనుష్యులు కావాలి. ఆ లెక్కన మొత్తం 35500 ల బూత్ లకు 14200 మంది అవసరమౌతారని శ్రీ గోపాలరెడ్డిగారు తెలిపారు.

పోలీసు బందోబస్తు గూర్చి మాట్లాడుతూ ఎన్నికల నిమిత్తం 15 పోలీసు పార్టీలను సిద్ధంచేస్తూ వున్నాం. వారు ఒక నియోజకవర్గం నుండి మరొక నియోజక వర్గానికి కదులుతూ వుంటారు. అవసర మైనంతవరకు సాయుధులై వుంటారు. పార్టీ బలగం ఎంత వుంటుందో చెప్పలేం అన్నారు.

ఎన్నికలకూ, ఫలితముల ప్రకటనకు గడువు ఎక్కువ పెట్టెదమనగా గడువు అవసరంకోసం నిర్ణయించినా సాధ్యమైనంత వరకు ఎన్నిక ఫలితం వెంటనే ప్రకటిస్తారని మంత్రిగారన్నారు.

1946 ఎన్నికల్లో మొత్తం 212 స్థానాలలో 81 స్థానాలు పోటీలేకుండా వచ్చాయి. అందులో 50 జనరల్ సీట్లను పోటీలేదు. ఆంధ్రంలో 18 నకరంలో 2, తమిళ నాడులో 24, దకేరళంలో 3 మలబార్ లో 3 స్థానాలకు పోటీలేదనియు ఈసారి ఎన్నికల్లో పోటీలేకుండా 10% కి మించి వుండకపోవచ్చని శ్రీ గోపాల రెడ్డిగారు అన్నారు.

నేటి విలేఖరుల సమావేశానికి ప్రధాన ఎన్నికలోద్యోగి శ్రీ యస్. సంకరేశ్వరన్, ఇతర ఉద్యోగులు హాజరయ్యారు.

## పోలీసుచర్య జరిగిన మూడేండ్ల పిమ్మట కూడా హైదరాబాదు సమస్య సమస్యగానే ఉంది

### సంస్థాన పరిస్థితి : స్వామీ రామానందతీర్థ సమీక్ష

హైదరాబాదుసమస్య దేశీయులదృష్టిని ఇంకా ఆకరిస్తూనే ఉన్నది. భారతీయుల మనస్సుల్లో విచిత్రమైన శ్రద్ధను పురికొల్పుతూనే ఉన్నది. స్వాతంత్ర్యానికి పూర్వపు బ్రిటిషు పరిపాలనలో అది సామ్రాజ్య వాదుల పన్నుగడలకు ఒక ప్రధానమైన కోటకొత్తళంగా ఉండి, లిబరలుల సాధన సంపత్తి వనరుల సన్నిహితనీ, జాతి చెరుపును కూడా లక్ష్యం చేయకుండా, బ్రిటిషువారి స్వార్థ ప్రయోజనాలను బలపరచడానికే విచ్చలవిడిగా వినియోగ పడినిస్తూ వచ్చింది. హైదరాబాదు అనాడు భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యం పాలికి గురుత్వాకర్షణ కేంద్రంగా పరిగణింప బడుతూ ఉండిన సంగతి అందరికీ బాగా తెలిసింది. పరాయి యజమానులకు ఆ పెద్ద మనిషి చేసిన మహత్తర సేవలకు ఫలితంగా ఈ సంస్థాన పరిపాలకునికి ప్రసాదింపబడిన 'సమ్మిక్షబంటు' 'శేవా నమ్మిన మిత్రి' అన్న బిరుదొక్కటే చాలు. హైదరాబాదు తక్కిన భారత సంస్థానాలకన్నా విభిన్నమైన పంథా తొక్కిన సంగతి, సంస్థాన పరిపాలకుడు సాగించుకొంటూ వచ్చిన విశేషాధికార దర్పం సంగతి చాటడానికి, సంస్థానంలో సాగుతూవచ్చిన ఆ వ్యవస్థలో ముస్లిము లీగూ, దాని అభివృద్ధి, భారతదేశంలోని మత రాజకీయాలూ బాగా వేళ్లు తన్నుకు పోయాయి. భారత స్వాతంత్ర్య పోరాట పురోగమనాన్ని అడ్డు పెట్టడానికి పుటమరించిన విచ్ఛిత్తికరపు వృత్తులన్నిటికీ ఈ సంస్థానంలో మంచి సాయమూ, బలమూ లభించాయి. స్వాతంత్ర్యం సిద్ధించి, దేశం రెండుగా చీలిపోయిన తర్వాత సంస్థానంలో అంతవరకూ అడ్డుమాకలు లేకుండా విజృంభిస్తూ వచ్చిన ముస్లింమత తత్వం సంస్థానానికి స్వతంత్ర భారతంలో ఒక్క ఊపున సర్వతంత్ర ప్రతిపత్తిని చేకూర్చడానికి ఉద్యమించడం చేత, అది పైఅన్నింటి సమష్టిఫలితమే. అధికార వర్గాలూ, వాటికి ఆసరాయిస్తూ వచ్చిన వర్గాలూ కూడా ప్రజాబాహుళ్యానికి పరమాదరణీయమైన భారతదేశంపైన కాకుండా పాకిస్థాన్ పైన దృష్టి ఎక్కువసారిస్తూవచ్చాయి. అంతలో హైదరాబాదు ప్రజలు మేలుకున్నారు. ఈ సవాలుకు సై అన్నారు. సంస్థానాన్ని భారతదేశంలో భాగంగా చేయడానికి సంస్థాన కాంగ్రెసు ఎడతెరపిలేని పోరాటానికి దిగింది. చివరకు పోరాటం పోలీసు చర్యగా పరిణమించింది. హైదరాబాదు తక్కిన భారతదేశంతో చేరిపోయింది. ఆ పోరాటం వివరాలు ప్రజల మెదడుల్లో ఇంకా మెదులుతూనే వుంటాయి. కాబట్టి వాటిని చర్విత చర్వణంగా తిపిన పవసరం కనపడదు. పోలీసు చర్యకు వెనువెంటనే మిలిటరీ గవర్నరుపరిపాలన ప్రారంభమయింది. సంస్థానంలో కొనసాగుతూ వచ్చిన అసాధారణ పరిస్థితితో దాని అవసరం తప్పనిసరిగా ఏర్పడ్డది. ఆ పరిస్థితుల్లో వెంటనే సివిలుపరిపాలన నెలకొల్పడం అయుక్తంగా ఎంచబడింది. మొదట యథాప్రకారస్థితి తీసుకురావాలి. అది నెమ్మదిమీద గాని సిద్ధించదు. ప్రజలు మిలిటరీ పరిపాలనమీద ఎక్కువ ఆశాదృష్టులు పెట్టుకొన్నారు. అందుకు తగినట్టు మిలిటరీ పరిపాలనకు సావకాశ సౌకర్యాలుకూడా ఉండినాయి. అంగుళల్ల అభ్యంతరం లేకుండా అభ్యుదయం ఏర్పడితీరుతుందని ఆశించారు. వారు ఆశించినట్లే, మిలిటరీ పరిపాలన, నానా అల్లరీచేసి నానా అవ్యవస్థ కలిగించియుండవలసిన దుష్టశక్తులను అదుపులోనికి తెచ్చి మొత్తంమీద చక్కని వాతావరణాన్ని కల్పించింది. ఇంతవరకూ బాగానే ఉంది. కాని, అది ఎంత గొప్పదైనా మిలిటరీ పరిపాలనకు హద్దు పద్దులుండాలి. కొంతి కొలానికి మటుకే అది బాగుంటుంది. అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే అది అక్కరకు వస్తుంది. యథా ప్రకారస్థితి సిద్ధించినవెంటనే అది తప్పుకొని సివిల్ పరిపాలనకు చోటివ్వాలి. కాని, హైదరాబాదులో ఇది జరగలేదు. 15 నెలలకుపైగా అక్కడ మిలిటరీ పరిపాలన కొనసాగింది. కాని, అంతటి సుదీర్ఘ కాలంలోకూడా అది సంస్థానంలో ప్రజల నెదుర్కొంటూ వచ్చిన చాలా సమస్యలను జయప్రదంగా పరిష్కరింపజాలక పోయింది. అంతో యింతో శాంతిభద్రతలు నెలకొల్పినమాటేవాస్తవమే. కాని, యితర సంగతులను పట్టించుకోవలసి నంతగా అది పట్టించుకోలేదు. ఆ రోజులను జ్ఞప్తికి తెచ్చుకుంటే మిలిటరీదృక్పథం ఎంత విచిత్రంగా వుంటుందో, సమష్టి జీవితంలోని వివిధ అంశాలమీదా అది యెలా ప్రసరించలేదో ఇప్పటికీ నాకు కండ్లకు గట్టినట్లు పొడగట్టుతుంది. ప్రజల స్థితిగతులు అంతకుముందు ఎలా ఉండినాయో ఇంచుమించు అదేస్థితిలో ఉండిపోయినాయి. ఆ తప్పు ఎవరిదీ అన్న ప్రశ్నే నేనిప్పుడు చర్చించదలచుకోలేదు. కాని, మిలిటరీ పరిపాలన యేనాడో ముగిసిపోయి సివిల్ పరిపాలన వచ్చివుండవలసింది అనే సంగతిమాత్రం ఖాయం. ప్రజలకిది యెంతో వ్యయప్రయాసల కొస్పదమయింది. ఈ విషయంలో అభిప్రాయభేదాలుండేవుండవచ్చు. కాని, హైదరాబాదులో మాలో చాలామంది అభిప్రాయంమాత్రం ఇదే.

మిలిటరీ పరిపాలనతర్వాత వచ్చిన సివిల్ పరిపాలన సాక్షిగానేపని సాగించుకొంటూ వచ్చింది. కొన్ని మార్పులు తీసుకు రావడానికికూడా ప్రయత్నించింది. సంపూర్ణ ప్రజాప్రభుత్వం ఏర్పడవలెనన్న ప్రతిపాదన ఎన్నో వంకలుచెప్పి పనుకకు నెట్టివేయబడింది. కమ్యూనిస్టు హడావిడిని ఒక కారణంగా పేర్కొన్నారు. యథాప్రకారస్థితి యింకా రాలేదని మరొక సాకు చెప్పారు. స్థానిక కాంగ్రెసులో తీరని వైషమ్యాలున్నాయని ఇంకొకవంక చూపారు. ఇవన్నీ కలిసినాకూడా ప్రజాప్రభుత్వ నిరాకరణను సమర్థించగలవా అన్న సందేహం ఎలాఉన్నా, కీర్తిశేషులైన సర్దారు పటేలు అధ్వర్యాన నడుస్తూ వచ్చిన సంస్థాన మంత్రివర్గానికి మాత్రం ప్రజా ప్రభుత్వం నిర్మించడానికి మనసురాక పోయిందన్నది మాత్రం సత్యం. మాప్రయత్నాలన్నీ విఫలమైపోయాయి. కాని, మరి కొంతకాలానికి ఒక విధమయిన సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. నలుగురు కాంగ్రెసువారు హైదరాబాదు మంత్రివర్గంలో చేరారు. హోంశాఖ, ఆర్థికశాఖ, వాణిజ్య పరిశ్రమలశాఖ, జనరల్ పరిపాలనశాఖలాంటి ముఖ్య శాఖలన్నీ అధికార మంత్రుల చేతులకే దఖలు పడ్డాయి. ఎందుకూ కొరగాని శాఖలు కాంగ్రెసు మంత్రులకు వచ్చాయి. ఈ సరి కొత్త ప్రయోగ పరిశీలన ఇంకా కొనసాగుతూనేవున్నది. రానున్న జనరల్ ఎన్నికలు ముగిసేవరకూ ఇది యిట్లాగే వుంటుంది. అప్పటికి, ఇది ముగిసిపోయి, ప్రజా ప్రతినిధు లెన్నుకొన్న మంత్రులు ప్రభుత్వానికి వస్తారు. ప్రజా ప్రభుత్వం సాధించి వుండగలిగినంతపని ఈ సివిల్ పరిపాలన సాధించకపోయిన సంగతి అక్షరాలా రూఢియే అయినప్పటికీ, అది ఉన్నంతలో సాక్షిగా సాగి, ప్రజల అభ్యుదయానికి ఎంతో చేయవలెనని ప్రయత్నించినమాట మాత్రం కొదనడానికి లేదు.

ఈ హైదరాబాదు విషయం అఖిల భారత సమస్య అనీ, యీ సమస్యను సవ్యంగానూ, సమగ్రంగానూ పరిష్కరించడానికి స్వతంత్ర భారతంయొక్క ప్రజాస్వామిక బలం చాలా అవసరమనీ హైదరాబాదు ప్రజల చిత్తవృత్తిని బాగా సన్నిహితంగా ఎరిగి, స్వాతంత్ర్య పోరాటంలో చాలా కృషిచేసిన మనుబోటివారి చాలామంది నమ్మకం. హైదరాబాదు ప్రజలు తమంతకు తాము యెంతెంతగా పాటుపడినప్పటికీ, యెంతెంతటి త్యాగసాహసాలకు వారు ఉంకించినప్పటికీ స్వతంత్రస్థాయిలో వారికి విమోచనం ఏర్పడుతుందనేది సున్న. మాలోని దౌర్బల్యంకొద్దీ వెల్లడిస్తున్న అభిప్రాయం కాదిది. యిది అక్షరాలా యథార్థమయిన విషయం.

ఎంతోమందికి యింతవరకు ఆక్టే తెలియని ఒక విచిత్ర విషయం ఇప్పుడు నేను వెల్లడిస్తాను. అప్పుడు నేను జైలులో ఉన్నాను. హైదరాబాదు ప్రభుత్వానికీ, ఇండియా ప్రభుత్వానికీ మధ్య యథాస్థితి ఒడంబడిక మీద సంతకాలైన సంతకాలుపడే రోజులవి. నేనప్పుడు సంస్థాన కాంగ్రెసుకు అధ్యక్షుణ్ణి. లాయకాలీ మంత్రివర్గంవారు నాతో రాయబారాలు ప్రారంభించారు. ఇంకా ఎన్నో షరతులతోపాటు ఒక ముఖ్యషరతు పేర్కొని దానికి నేను ఒప్పుకోవలసి వుంటుందన్నారు. అదేమిటంటే—ఒకవేళ ఇండియాకూ, పాకిస్తానుకూ యుద్ధం ఏర్పడే పక్షములో హైదరాబాదు తటస్థంగా ఉండాలి అని. అది యెంతటి అసంబద్ధమైన కోరికో దాని ముఖాన్నే స్పష్టంగా గోచరిస్తుంది. దానికి నసేమిరా ఒప్పుకోనని నేను గట్టిగా చెప్పివేశాను. హైదరాబాదు ఇండియాలో చేరిపోతుంది. అని మొట్టమొదట గట్టిగా ప్రకటించండి. తక్కిన విషయాలు సావకాశంగా చర్చించుకొని ఒక నిర్ణయానికి వద్దామన్నాను. ఇంకముందరి రాయబారాలు అంతటితో ఆపిమని ఆగిపోయాయి. నన్నూ, నాతోపాటు మరి కొందరినీ జైలునుంచి విడిచిపెట్టడంమాత్రం మిగిలింది. మళ్ళీ జైలుకు దారి వెతకడానికి నేను బయలుదేరవలసి వచ్చింది.

దిక్కుమాలినంతమంది పెద్దా చిన్నా జమీందార్లు కలిగి, అంతకు లక్షలెట్లుగా సెంటుభూమికూడా లేని నిరుపేదరైతులతోకూడియున్న రకమనేది ముందుకు లేకున్న తెలంగాణా ప్రాంతం హైదరాబాదులో కెల్లా భారతి కమ్యూనిస్టువారికి కమ్యూనిస్టు ఉద్యమానికి చక్కని ఆటపట్టుగా లభించింది. మూడేండ్లుగా వారుగావిస్తున్న హింసవిహారానికి అంతేలేదు. వారిసాయుధపోరాటానికి బలి అయి ప్రజలు పడుతున్నపాట్లకు అంతేకన్నా అంతేలేదు. కమ్యూనిస్టులు ప్రజలనుండి పూర్తిగా వేరుపడిపోయినారు. ఉత్తరోత్తరా వారి కార్యక్రమ మేమిటో వారే చెప్పాలి. అయితే, ఒక్క సంగతి మాత్రం నిజం. తెలంగాణాలోని రైతుజన అసంతృప్తికిల్లా మూలకారణం భూమిసమస్య. కమ్యూనిస్టులు దానిని తమ ఉద్యమానికి మంచిసాకుగా దొరకబుచ్చుకొన్నారు. ముందు అసమస్యను పరిష్కారం చేయాలి. ఈసమస్యవిషయమై బాగా లోతుకు తరచితరచి ఆలోచించి దీనిని బాగా ఆకళించుకొన్నవారు అయిదుగురు వ్యక్తులు గల కుటుంబానికి, ఎంత ధారాళంగా ఖర్చుపెట్టేదైనా, 100 ఎకరాల మెరకా, 25 ఎకరాల మాగాణీ ఉంటే చాలుననీ, అంతకు మించి భూములున్న వారందరూ ఆ అదనపు భూములను అసలు భూములు లేని వారికి వదలిపెట్టవలెననీ తేల్చారు. ఇది వెంటనే జరగాలి. ప్రజాస్వామిక పరిపాలన జయాపజయాలు ముఖ్యంగా దీనిపైనే ఆధారపడివుంటాయి.

హైదరాబాదు సమస్యలో అతి ముఖ్యమైనదన్నప్పటికీ, నేటివరకూ కూడా పరిష్కారం కాకుండానే ఉండిపోయిన అంశం ఇంకొకటున్నది. హైదరాబాదు సంస్థానం ఒక నిరంకుశ పరిపాలనక్రింద కృత్రిమంగా నిబద్ధమయిన విభిన్నవర్గాల ఒక ప్రాంతీయ కూటమి. ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడ- అనే మూడు విభిన్న భాషాప్రాంతాలు అందులో వున్నాయి. అవి అన్నీ కూడా సంస్కృతిలోనూ, సంప్రదాయంలోనూ, భాషలోనూ, భావంలోనూ తమకు సన్నిహితంగా వున్న ఆయాసాటి ప్రాంతాలతో ఏకపాళబద్ధమై ఉన్నాయి. అందువల ఆయా ప్రాంతాల్లో చేరిపోతే బాగుంటుందని వీటికి ఏనాటినుంచో వాంఛ హృదయగతంగా వుంటూ నేవున్నది. సర్వ మెరిగిన సంస్థాన రాజకీయవేత్తలు కూడా భాషాప్రయుక్తంగా సంస్థాన విభజనకు సుముఖంగానే ఉన్నారు. సంస్థానంలో కెల్లా బలవత్తమమైన రాజకీయసంస్థ హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు. దానితోపాటు సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ, షెడ్యూల్ జాతుల ఫెడరేషనూ, కర్షకులా కార్మికుల పార్టీ-అన్నీ కూడా ఈ కోరికల విషయంలో ఏకాభిప్రాయమే గట్టిగా వెల్లడిస్తున్నాయి. ఒక కృత్రిమ కూటమిగా సంస్థానం ఇలాగే ఉండిపోయినంతమాత్రంచేత జరిగే మంచి యేమీ బొత్తిగా ఉండబోదని మా అందరి అభిప్రాయం. ఆయాభాషా ప్రాంతాలు సన్నిహితంగా ఉన్న ఆయా భాషాప్రాంతాలతో కలసిపోవడమే యిప్పట్లో సహజమైన పరిష్కార మార్గం కాగలదు. రానున్న ఎన్నికల పోరాటంలో హైదరాబాదు కాంగ్రెసు యీ విషయాన్ని ముఖ్య లక్ష్యంగా పెట్టుకోవడానికి నిశ్చయించుకొన్నది. ఇది ఏకపక్షీయమైన విధానం కారాదని మాకు తెలుసు. భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సమస్య అనేది ఒక అఖిల భారత సమస్య. హైదరాబాదు విభజన తప్పకుండా దానితో లంకెపడిందే. యావజ్జాతికి అవసర మనిపించినప్పుడు అది వస్తుంది. కొత్తగా ఎన్నికైన సంస్థాన శాసనసభ సంస్థాన విభజనను కోరుతూ ఒకతీర్మానం చేయాలి. దానిని అమలు పరచడు మెలాగో ఆ సంగతి చూచుకొనే బాధ్యత ఇండియా పార్లమెంటుది. వాటితో హైదరాబాదుసమస్య అంటూ మరి ఉండబోదు. ఒక్క చరిత్రలో మాత్రమే అది ఉండిపోతే ఉండిపోతుంది. ఆ శుభ పర్యవసాన దినం ఆట్టే దూరంలో లేదని మనమంతా ఆశిద్దాం.

## మారేపల్లి రామచంద్ర కవిగారి నిర్యాణము

ఉయ్యూరు, సెప్టెంబరు 10: సుప్రసిద్ధ భాషా పరిశోధకులు, పండితులు, దేశసేవకులు అయిన మారేపల్లి రామచంద్ర కవిగారు ఇక్కడ నిన్న రాత్రి 10 గంటలకు స్వర్గస్థులయ్యారని తెలియజేయ్యడానికి విచారిస్తున్నాము.

వీరు కృష్ణాజిల్లా కవకపల్లి గ్రామంలో 1874 లో జన్మించారు. విశాఖపట్టణంలో ఎఫ్. ఏ. చదువుతూ వీరు తమ విద్యాభ్యాసం చాలించి. దేశీయోద్యమంలో పాల్గొన్నారు. అప్పుడు విశాఖపట్టణం కళాశాలా ధ్యక్షులుగా ఉన్న పి. టి. శ్రీనివాసయ్యంగారు వీరి కవిత్వశక్తికిమెచ్చి వీరికి 'కవి'అని పేరుపెట్టారు. అప్పటినించీ రామచంద్ర శాస్త్రిగారికి 'రామచంద్ర కవిగారనే నామధేయం ఏర్పడ్డది.

శాస్త్రిగారు రచించిన కావ్యాలు నాటకాలు, వచన గ్రంథాలు, అను, వాదాలు ఇంచుమించుగా ఇరవైదాకా ఉన్నాయని తెలుస్తున్నది. వీటిలో చాలావరకు ఇప్పటికీ అముద్రితంగానే ఉండిపోయాయి.

శాస్త్రిగారు ఆంధ్రోద్యమంలోను, ఆంధ్రదేశీయ గ్రంథాల యోద్యమంలోను చేసినసేవ అమూల్యమయినది. ఆంధ్రదేశ గ్రంథాలయసభకు వీరు చిరకాలంఉపాధ్యక్షులుగాఉన్నారు. ఇంతేకాక చాలాకాలం వీరు ఆంధ్రమహాసభకు కూడా ఉపాధ్యక్షులుగా వహించారు. జీవితాంతము వరకు వీరు ఆంధ్రోద్యమంలోను, గ్రంథాలయోద్యమంలోను సారస్వతోద్యమంలోను అవిరళంగా కృషిచేస్తూనే ఉన్నారు. 1931, 32 సంవత్సరాలలో వీరు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని కారాగార శిక్ష అనుభవించారు.

విశాఖపట్టణంలోని కవితా సమితికి అధ్యక్షులై ఆసమితిద్వారా వీరు చేసిన సారస్వత సేవ ప్రత్యేకంగా సంస్మరింపదగినది.

వీరు కొంతకాలం నించి తెలుగు నిఘంటువు వ్రాయాలని సంకల్పించి అరచనలో నిమగ్నులైఉన్నారు. ఈ నిఘంటువు పేరు 'నుడికడలి.' ఇది చాలా వరకు పూర్తి అయినదనీ, త్వరలోనే శాస్త్రిగారు దీనిని ప్రకటించారని సంకల్పించారనీ, తెలుస్తున్నది. దీనిలో వీరు దేశీయములయిన తెలుగు పదాలకు వ్యుత్పత్త్యర్థాలు వ్రాశారు.

ద్రావిడాది భాషలలో ప్రత్యేక కృషి సల్పిన శాస్త్రిగారి నిఘంటువు ప్రామాణికమైనది కాగలదు. బహుభాషావేత్తలయిన వీరు రచించిన 'తెనుగు తోబుట్టువులు' అనే గ్రంథం విద్వాంసుల మన్నన లందుకొన్నది. వివిధ రంగాలలో నిరంతర కృషిసల్పిన కవిగారి నిర్యాణము ఆంధ్రదేశానికి తీరనిలోటు. వీరికుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

## ఫక్తూనిస్థాన్ ఉద్యమానికి భారతప్రభుత్వ ప్రోత్సాహం

### పాకిస్థాన్ ఆరోపణ నిరాధారమని ఢిల్లీ ఖండన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: "ఫక్తూనిస్తాన్ ఉద్యమం విషయమై పాకిస్తాన్ కూ అఫ్ఘనిస్తాన్ కూ వచ్చిన వివాదంలో భారతీయ పత్రికలూ, ఆలిండియా రేడియో పక్షపాత వైఖరి ప్రదర్శిస్తున్నాయనే ఆరోపణ ఎంతమాత్రం నిజంకాదు; పైగా, నేపాలు, టిబెట్టు, చైనా మొదలైన ఇరుగుపొరుగు దేశాలతో ఇండియాకు వుంటున్న స్నేహసంబంధాలను చెడగొట్టి ఇండియాకూ వారికీ మధ్య తగవులు పెట్టడానికి పాకిస్తాన్ రేడియో, పాకిస్తాన్ పత్రికలే ఇండియా మీద దుష్ప్రచారం సాగిస్తున్నాయి" అని భారత ప్రభుత్వం పాకిస్తాన్ ప్రభుత్వానికి ఈనెల ఒక లేఖలో ఖండితంగా జవాబు ఇచ్చింది. భారత ప్రభుత్వం ఈ లేఖ ఢిల్లీలోని పాకిస్తాన్ హై కమిషనర్ ద్వారా పాకిస్తాన్ ప్రభుత్వానికి అందజేయబడింది. భారత ప్రభుత్వం పంపిన ప్రత్యుత్తరంలోని సారాంశం ఇది:—

పాకిస్తాన్ అఫ్ఘనిస్తాన్లకు వచ్చిన వివాదంలో భారతీయ పత్రికలు పక్షపాతం చూపుతున్నాయనే పాకిస్తాన్ ప్రభుత్వం వాదాన్ని భారత ప్రభుత్వం అంగీకరించలేకుండావుంది. పాకిస్తాన్ కు అఫ్ఘనిస్తాన్ కు కలిగిన అభిప్రాయభేదాల నరించి పాకిస్తాన్ అఫ్ఘనిస్తాన్లతోపాటు ఇంకా అనేక ఇతరదేశాలలోకూడా పత్రికలద్వారా రేడియోద్వారా విస్తృతంగా ప్రచారం జరిగింది. యావత్ప్రపంచాన్ని ఆకర్షించిన ఇటువంటి విషయం భారతదేశంలో కూడా దొర్లు క్యాన్ని రేకెత్తించడం ఆశ్చర్యం కాదు. కాని ఈ విషయాన్ని గురించి జరిగిన ప్రచారం యావత్తు అతినిష్పక్షపాతంగా జరిగిందని భారత ప్రభుత్వం ఇక్కడి పత్రికలలో ప్రకటించబడిన వార్తలను పరిశీలించిన మీదట అభిప్రాయపడుతున్నది. అఫ్ఘనిస్తాన్ అధికారుల ప్రకటనలనూ పాకిస్తాన్ అధికారుల ప్రకటనలనూ కూడా భారత పత్రికలు ప్రచురిస్తూవచ్చాయి. ఇకపోతే వ్యాఖ్యానాలూ విమర్శలూ అంటారా, అవి యెవరిబుద్ధికి తోచినవిధంగా వారు చేసేవేగాని ఇందులో ప్రభుత్వం జోక్యం కల్పించుకొని చేయగలిగింది ఏమీ లేదు. మా రాజ్యాంగాన్ని అనుసరించీ, మా శాసనాలను అనుసరించీ, ఎవరికి తోచిన అభిప్రాయాలను వారు వెల్లడించడానికి ప్రతివారికీ అధికారం వుంది.

ఇలాగే ఆలిండియా రేడియో కల్పిత వార్తలను ప్రచారం చేస్తున్నదనే ఆరోపణకూడా విచారణకు నిలిచేది కాదు. ఆలిండియా రేడియోకు పాకిస్తాన్ రేడియో ప్రచారం చేస్తున్న వార్తలు ఎంతో ప్రామాణికమైనవి, కబుల్ న్యూస్ ఏజెన్సీ, కాబూల్ రేడియో ప్రసారంచేసే వార్తలు కూడా అంతే ప్రామాణికం. ఈ రెండు వైపులనుంచి వచ్చిన వార్తలనుకూడా ఆలిండియా రేడియో ప్రసారం చేస్తూవుంటుంది.

భారతీయ పత్రికలూ ఆలిండియా రేడియో కొన్ని వార్తలను వ్యాఖ్యా

(4-వ పేజి చూడుడు)

## క్రీడారంగం

### ఐ. ఎఫ్. ఎ. షీల్డు ఫుట్‌బాల్

కలకత్తా సెప్టెంబరు 11: ఐ.ఎఫ్.ఏ. షీల్డు ఫుట్‌బాల్ టూర్నమెంటు నందు నేడు మోహన్ బగాన్ జట్టునకు, తూర్పు బెంగాలు జట్టునకు జరిగిన ఫైనలు ఆట 'డ్రా' అయినది. విపక్షములు ఒక్క గోలుకూడ చెయ్యలేదు. ఆట గతినిబట్టి తూర్పు బెంగాలు జట్టు గెలువదగి యున్నారు. కాని మోహన్ బగాన్ జట్టు రెండవ సగం ఆటలో చూపిన నైపుణ్యంవలన ఆట 'డ్రా' అయినది. ఈ ఆట చూచుటకు దాదాపు 50 వేల మంది ప్రజలు వచ్చారు. గత రెండు సంవత్సరాలలోను యీ టూర్నమెంటులో తూర్పు బెంగాలు జట్టు గెలుపొంది యున్నది.

### ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్

ఖరగ్‌పూర్ సెప్టెంబర్ 11: ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్ టూర్నమెంటు నందు నేడు బొంబాయి బరోడా సెంట్రల్ ఇండియా రైల్వే జట్టునకు నిజాం స్టేటు రైల్వే జట్టునకు జరిగిన ఆట 'డ్రా' అయినది. ఇరుపక్షములు చెరి ఒక గోలు చేసినవి.

### ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్

బెంగుళూరు, సెప్టెంబరు 11: కటక్‌లో యీ నెల 15 నుండి జరుగనున్న ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్ టూర్నమెంటునందు దక్షిణ ప్రాంతంనుండి 11 యూనివర్సిటీలు పాల్గొంటున్నవి. ఇందులో ఆంధ్ర యూనివర్సిటీ కూడ ఉన్నది. గత సంవత్సరం యీ టూర్నమెంటులో ఉస్మానియా యూనివర్సిటీ గెలుపొందియున్నది. ఆంధ్ర యూనివర్సిటీకి, సింహళం జట్టునకు 15 వ తేదిన ఆట జరుగుతుంది.

### నేషనల్ టేబుల్ టెన్నిస్

మద్రాసు, సెప్టెంబరు 12: 14 వ నేషనల్ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్పు పోటీలు ఈ సంవత్సరం డిసెంబరు 22 నుండి 31 వరకు మద్రాసులో జరుగుతవి. వీటిని మద్రాసు రాష్ట్ర టేబుల్ టెన్నిస్ సంఘం నిర్వహిస్తుంది.

మద్రాసు టేబుల్ టెన్నిస్ సంఘ కార్యవర్గ సమావేశం యీ నెల 9 వ జరిగినప్పుడు విజయనగరం రాజాగారు సంఘమునకు యావజ్జీవ ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు.

## రేడియో

### సెప్టెంబరు 14 శుక్రవారం

విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వా॥

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ... 1 మద్రాసు (బి) వలె, 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 మద్రాసు (బి) వలె 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు ... ప్రసంగం హిందీ పాఠము 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు ... ప్రసంగం ...

సా॥ 5-30 ఏ. వెంకయ్య నాదస్వరం 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (బి) ఎస్. రాజేశ్వరరావు 6-30 గ్రామస్థుల కార్యక్రమం ... 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం ... 7-30 సంగీతకలు 7-45 ... 7-55 సితార్ ... 8 ... 9 ఆంగ్లమున వా॥ 9-15 ...

మద్రాసు (ఎ)

ఉ॥ 7 ప్రోగ్రాము 7-30 గోరీ శంకరరావు ... 8 ఆంగ్లమున వా॥

మ॥ 12-30 ... 1-40 హిందీలో వా॥ 1-50 ... 2-10 ... 2-16 ... 4-31 ...

సా॥ 5-30 ... 6 ఆంగ్లమున వా॥ 6-10 ... 6-20 ... 7-30 ... 7-45 ... 8-15 ... 9-15 ... 10-30 ముగింపు.

మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ... 7-30 (ఎ) వలె.

మ॥ 12 ... 12-30 ... 1 ... 1-30 ... 1-50 ... 2 ... 2-15 ... 4 ...

సా॥ 5-30 (ఎ) వలె 6-20 ... 6-30 ... 7 తెలుగున వా॥ 7-15 ... 7-45 ... 8-15 (ఎ) వలె 9-30 ... 10-30 ముగింపు.

హైదరాబాదు

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ... 7-30 ... 8-15 ... 8-30 ... 9 ...

# రైతులకిచ్చే ఋణాలపై వడ్డీ తగ్గించవీలుకాదు

## పరపతి సంఘాలవల్ల లాభాలు: శ్రీ చంద్రమౌళి వివరణ

తంజావూరు, సెప్టెంబరు 11:— "సహకార పరపతి సంఘోద్యమము వల్ల జనసామాన్యానికి చాలా లాభం కలిగింది. ఇతర సంఘాలతో పోల్చిచూచిన యెడల యీ పరపతి సంఘాలవల్ల కలిగిన ప్రయోజనాలు, చాలా ఎక్కువ అని స్థానిక స్వపరిపాలనశాఖ మంత్రి శ్రీ చంద్రమౌళిగారు ఇచ్చట తంజావూరు సహకార భూమితనఖా బ్యాంకు రజతోత్సవాలను ప్రారంభిస్తూ చెప్పారు. పరపతి సంఘోద్యమ మూల సిద్ధాంతములను ఆశయాలను మంత్రి వివరిస్తూ యీ వుద్యమము వృద్ధినొందితేగాక, అదరికి లాభదాయకమన్నారు.

రయితులకుయిచ్చే ఋణాలపై వడ్డీ తగ్గించాలనే కోర్కె విషయమై ప్రస్తావిస్తూ ఇప్పుడు వడ్డీ సరసముగానే వున్నదని, దానిని ఇంకా తగ్గించవీలు లేదని శ్రీ చంద్రమౌళిగారు అన్నారు. ఈ ఉత్సవాలు జయప్రదంగా జరుగుగాక అని కోరుతూ ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా మున్నగు అనేకులు సందేశాలు పంపారు.

పరపతిసంఘాల రిజిష్ట్రారు రయన్‌గారు ఉపన్యసిస్తూ సహకార భూమి తనఖాబ్యాంకుల విధులను వివరించారు. రయితులకు పరపతి సౌకర్యాలను కల్పించడమే వాటికర్తవ్యమన్నారు. తంజావూరు భూమి తనఖాబ్యాంకు అభివృద్ధిని ఆకాంక్షించారు.

### మంగళగిరి నియోజక వర్గంలో 5 గురి దరఖాస్తులు

మంగళగిరి, సెప్టెంబరు 10: రానున్న ఎన్నికలలో ఈ నియోజక వర్గంనుంచి కాంగ్రెసు తరఫున పోటీ చేయటానికి దిగువ పేర్కొన్న 5 గురు దరఖాస్తులు పెట్టారు.

మేకా కోటిరెడ్డి, గుంటుపల్లి వెంకటప్పయ్య, పోసాని ప్రకాశరావు, పి. ఆర్. రామానుజాచార్యులు, కాశింగి వెంకటరత్నంగార్లు. (స్వ. వి.)

### మంగళగిరి రేషన్‌డిపోలలో బియ్యం లేవు

మంగళగిరి, సెప్టెంబరు 10: యీ వూరిలో వున్న 18 రేషన్ షాపులలో ఏ ఒక్కదానిలోనూ బియ్యం దొరకక, ప్రజలు గుంపులు గుంపులుగా ఆ డిపోల చుట్టూ తిరుగుతున్నారు. పోయిన వారంలో ఎంతిమందికి కలిపివున్న కార్డయినా సరే, కొద్దకు 2 శేర్లు చొప్పున యిచ్చారు. ఈ వారం ఆఖరుదాకా బియ్యంరావని డిపోల వారు చెప్తున్నారు. (స్వ. వి.)

### ఒంగోలులో 9 ఏండ్ల బాలిక హత్య

ఒంగోలు, సెప్టెంబరు 10: సాతాని రంగయ్య కుమార్తె 9 ఏండ్ల బాలికను ఎవరో హత్యచేసి, ఘోషా ఆస్పత్రి వెనుక పారవేసి వెళ్ళారు. బాలిక వంటిపైగల నగలకోసం ఆశించి ఆ దుర్మార్గులు యీ పనికి ఒడిగట్టినట్లు అనుమానించబడింది. పోలీసు వారు యీ సందర్భంలో కొందరిని అనుమానంపై అరెస్టు చేశారు. (స్వ. వి.)

## సభలు—సమావేశాలు

ఆంధ్రరాష్ట్ర ట్రేడు యూనియన్ కౌన్సిల్ (అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అనుబంధ శాఖ) ప్రతినిధుల సమావేశం యీ 18 న విజయవాడలోని ఏలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో మ॥ 12 గం. కు జరుగనున్నట్లు కె. ఎల్. నరసింహంగారు (కన్వీనరు) తెలుపుతున్నారు.

ఆంధ్ర కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కార్య నిర్వాహకవర్గ సమావేశం యీ 14 న విజయవాడలోని బకింగ్‌హాం పేటబందరురోడ్డు 20/8 భవనంలో మ॥ 3 గంటలకు జరుగనున్నట్లు రాష్ట్ర కార్యదర్శి ముదిలి వెంకటేశ్వరరావుగారు తెలుపుతున్నారు.

ఆంధ్ర ప్రజాపార్టీ కార్యవర్గ సమావేశం లోగడ ప్రకటించినట్లుగా యీ 16 న కాక, 17 న విజయవాడలో జరుగనున్నట్లు వన్నప నేని వెంకటసుబ్బయ్యగారు తెలుపుతున్నారు.

దక్షిణ భారత గ్రామోద్యోగ ఫెడరల్ సంఘ కార్యవర్గ సమావేశం ఈ 16 న మ॥ 3½ గం. కు గుంటూరుజిల్లా గ్రామోద్యోగుల సంఘ భవనం (గుంటూరు)లో జరుగనున్నది.

సా॥ 5-30 మహారాష్ట్రమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 ... 6-45 గ్రామసీమ ... గీతాలు (3) ... 7 తెలుగున వా॥ 7-15 ... 8-15 ... 8-30 ... 8-40 ... 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీ వా॥ 9-30 ...

కార్పొరేషన్ బాంబు

... సెప్టెంబరు 13: ...

### ఉద్యోగులపై ఆరోపణలు

#### లీగలు సహాయ మిచ్చుటకు ప్రభుత్వ నిర్ణయం

మదరాసు, సెప్టెంబరు 11: ప్రభుత్వ ఉద్యోగులమీద అభూతకల్పనగా అవినీతి ఆరోపణ జరిగినప్పుడు అట్టి ఆరోపణలు చేసినవారిపై తగు చర్యతీసుకొనుటకు వీలుగా ఉద్యోగులకు లీగలు సహాయ మివ్వవలెనని ప్రభుత్వంవారు నిశ్చయించారు.

యీ నిర్ణయము ననుసరించి ప్రభుత్వోద్యోగిపై వచ్చిన ఆరోపణ నిరాధారమని తేలి ఆ ఉద్యోగి ఆరోపణ చేసిన వారిమీద చర్యతీసుకొన దలచిన ఉద్యోగి పనిచేస్తూవున్న కార్యాలయాధికారి కలెక్టరుతో సంప్రదించి అవసరమగు లీగల్ సహాయానికి ఏర్పాట్లు చేయాలని వుత్తర్వు చేశారు. జిల్లా అధికారి, డిపార్టుమెంటు అధికారిపైననే ఆరోపణలు వచ్చిన వారిపైఅధికారి లేక ప్రభుత్వంవారి అనుమతి పొందవలసి వుంటుంది.

### సహకార పాలసప్లయి సంఘాలు

#### 3 సం॥ ల వరకు సేల్సుటాక్సు మినహాయింపు

మదరాసు, సెప్టెంబరు 11: 1949 జూన్ 1 దరిమిలా ఏర్పడిన సహకార పాలసప్లయిసంఘాల యూనియన్‌ను, ఇకముందు యేర్పడేవానిని సేల్సుటాక్సునుండి సంఘం యేర్పడిననాటి నుండి మూడు సంవత్సరముల వరకు మినహాయించ వచ్చని ప్రభుత్వంవారు వుత్తర్వు చేశారు.

### కాంబోడియా ప్రత్తిపై ధరకంట్రోలు రద్దు

మదరాసు, సెప్టెంబరు 11: బొంబాయి టెక్స్టైల్ కమిషనర్ కాంబోడియా సి ఓ-4 లాంటి కొన్ని మేలు రకం ప్రత్తిరకములను ధరలకంట్రోలు నుండి మినహాయించారు. కాంబోడియా సిఓ-4 పండించే రైతులకు వ్యవసాయ శాఖవారు ఒక ధృవపత్రం ఇస్తారు. ఆ ధృవపత్రం వున్నవారు ప్రత్తిని హెచ్చు ధరకు అమ్మకోవచ్చు.

### మెడికల్ కవున్సిల్ అధ్యక్షుని ఎన్నిక

మదరాసు, సెప్టెంబరు 11: ఇండియన్ మెడికల్ కవున్సిల్ ద. భా. రాష్ట్రశాఖ కార్యకవర్గ సమావేశమయి మదరాసు మెడికల్ కవున్సిల్‌కు అధ్యక్షునిఎన్నుకొనే హక్కును తొలగించుట ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధమని భావించి సెలెక్టుకమిటీ బిల్లును పరిశీలించునప్పుడు ఆ సవరణను తీసివేయగోరుతూ తీర్మానించారని అధ్యక్షుడు డా॥ యు. కృష్ణారావుగారు వ్రాస్తున్నారు.

### శనగపంట అంచనా

మదరాసు, సెప్టెంబరు 11: 1950 51-లో మదరాసు రాష్ట్రంలో 1,25,400 యకరాల్లో శనగపంట వేసినట్లు అంచనా వేశారు. పంటవిస్తీర్ణం నిరుటికంటె 6% తగ్గినా అయిదు సం॥ ముల సగటుకంటె 44.6% ఎక్కువ. నాట్ల కాలంలో వానలు లేకపోవుటవల్ల ఈ సంవత్సరం కొంత తగ్గింది. పంటదిగుబడి ఈ సంవత్సరం మామూలుకంటె తక్కువగా వుండవచ్చని అనుకుంటున్నారు. ఈ అంచనా ప్రకారం 28,500 టన్నులపంట వుండవచ్చు.

### ప్రకాశం పంతులుగారి పర్యటన

మదరాసు, సెప్టెంబరు 11: ఆంధ్ర ప్రజాపార్టీ నాయకుడు శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు రేపు 12 వ తేదీ రాత్రి మెయిలులో బయల్దేరి నరసరావుపేటకు వెళ్తారు. అక్కడ 13 వ తేదీని జరిగే గుంటూరుజిల్లా ప్రజాపార్టీ మహాసభకు అధ్యక్షత వహిస్తారు. 14 వ తేదీని తెనాలినుండి మెయిలులో బయల్దేరి 15 వ తేదీ ఉదయానికి మదరాసు వస్తారు. మదరాసులో 15, 16 తేదీలందు జరుగగల అఖిలభారత ప్రజాపార్టీ కార్యవర్గసభకు హాజరౌతారు. తిరిగి 17 వ తేదీ రాత్రి మెయిలులో విజయవాడకువెళ్లి అచ్చట ఆంధ్ర ప్రజాపార్టీ కార్యవర్గసభకు హాజరయ్యెదరు. ఈ సభ యిదివరకు 14 వ తేదని జరుగునని ప్రకటింపబడి అఖిలభారత ప్రజాపార్టీ కార్యవర్గసభ 15, 16 వ తేదిలలో ఏర్పాటయిన కారణమున యీ నెల 18 వ తేదకి వాయిదా వేయబడింది.

### శ్రీ పి. సి. ఘోష్‌గారు

ప్రజాపార్టీ కేంద్ర కార్యదర్శి శ్రీ పి. సి. ఘోష్ ... కలకత్తానుంచి ... మదరాసు వస్తున్నారు. ... రాత్రి వారు ...

## రాష్ట్రవార్తలు

### విజయవాడ

విజయవాడ వస్త్ర వ్యాపారుల సంఘ అధ్యక్షుడుగా గోర్ల పావన కాలరావు, ఉపాధ్యక్షుడుగా గ్రంధి లక్ష్మణస్వామి, కార్యదర్శిగా పెరుమాళ్ల కుటుంబరావు, సహాయ కార్యదర్శిగా పుల్లకణం శ్రీరంగనాయకులు గార్లు యిటీవల ఎన్నికైనారు.

### గుంటూరు

రాష్ట్ర ప్రభుత్వ సేల్సుటాక్సు అప్పిలేట్ ట్రిబ్యునలులో సభ్యుడుగా నియమించబడిన వి. కె. ఉపద్రష్టగారి గౌరవార్థం ఇండియన్ చేంబర్ ఆఫ్ కామర్సు వారు యీ 3 వ తేదీని విందు చేశారు. చేంబరు అధ్యక్షుడు వీరం సుబ్బారావుగారు సమావేశానికి అధ్యక్షత వహించారు. చేంబరువారు, ఇన్‌కంటాక్సు, ప్రొఫెషనల్ సన్మాన పత్రాలు సమర్పించారు. కార్యదర్శి ఆర్. వి. సుబ్బారావుగారి వందనాలతో సభ ముగిసింది.

### తెనాలి

రణరంగ చౌకులో యిటీవల రావి సత్యనారాయణగారి అధ్యక్షతను జరిగిన శాంతి మహాసభలో డా॥ జయసూర్య నాయుడు (హైదరాబాదు) గారు యుద్ధాన్ని అరికట్టవలసిందిగా శాంతి కాముకులను కోరారు. జి. వి. కృష్ణశర్మగారు జయసూర్యగారి వుపన్యాసాన్ని తెనుగు చేశారు. వావిలాల గోపాలకృష్ణయ్యగారి ప్రసంగానంతరం రావి చిన్నమయ్యగారి వందనాలతో సభ ముగిసింది.

చెన్నరాష్ట్ర రిక్షా (గంజాము ఆయుర్వేద కళాశాలల పట్టభద్ర సంఘ ప్రథమ మహాసభల ఆహ్వానసంఘం యిక్కడ యీ 2 న డా॥ డి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశమై మహాసభలను యిక్కడ ఈ నెలాఖరులో జరుపాలనీ, అధ్యక్షత వహింపవలసిందిగా నీలం సంజీవరెడ్డిగారినీ, సభను ప్రారంభించవలసిందిగా మంత్రి కల్లూరి చంద్రమౌళిగారిని కోరాలని తీర్మానించుకొన్నారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా గోగినేని వెంకటసుబ్బయ్యగారిని ఎన్నుకొన్నారు.

### పాలకొల్లు

స్థానిక చేనేత సహకార సంఘ సర్వసభ్య సమావేశం గత 29 న కాలెపు బసవరాజుగారి అధ్యక్షతను జరిగింది. కాలెపు బసవరాజు, గుడిమెట్ల గంగరాజు, యినుమర్తి లక్ష్మణరావు, బాసివ కోటిలింగం, యర్రా వీర్రాజు, తూలిక మావుళ్ళు, బళ్ళ వీరభద్రరావుగార్లు డైరెక్టర్లుగా ఎన్నికైనారు. నాటిసాయంకాలం ఎం. సుదర్శనంగారి అధ్యక్షతను పంచమ వార్షికోత్సవం జరిగింది. కడుపు రాములుగారు సభను ప్రారంభించారు. నూలు ధరలను 1948 నాటి దరలకు తగ్గించమనీ, ముతక నెంబర్ల నూలు హెచ్చుగా సరఫరా చేయించమనీ ప్రభుత్వాన్ని కోరారు. సహకార కేంద్ర బ్యాంకులో చేనేత సొసైటీల తరఫున ఒక డైరెక్టరును నియమించమని బ్యాంకు వారిని కోరారు.

### నర్సాపురం

టెయిలర్ హైస్కూలు బ్రాంచి సారస్వత సంఘ ప్రథమ సమావేశం పి. ఆనందరాజుగారి అధ్యక్షతను గత 29 వ జరిగింది. కాలేజీ కార్యదర్శి యర్రమిల్లి నారాయణమూర్తి పంతులుగారు విద్యార్థులకు హితవులు యిచ్చారు. పోపూరి అంబన్న శాస్త్రిగారి వందనాలతో సభముగిసింది.

### నందిగామ

కృష్ణాజిల్లా ఎరుకల సంఘ కార్యకర్తలు నాయకులు గత 26 న యిక్కడ హనుమ సత్యనారాయణగారి అధ్యక్షతను సమావేశమైనారు. రాష్ట్ర ఎరుకల సంఘం స్థాపితమైన యీ 3 ఏండ్లలో, కొనసాగిన కృషిని అధ్యక్షుడు వివరించి, యిక యిప్పటికైనా రాష్ట్ర ఎరుకల సంఘనాయకులు మనస్పర్థలు విడనాడాలనీ, జాత్యభివృద్ధికి కృషి చేయ సంసిద్ధులు కావాలని అన్నారు. సత్యనారాయణగారు ప్రవేశ పెట్టిన ఐక్యతీర్మానాన్ని సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించారు.

చదల జానకిరామరావు, యరబుడి బసవయ్య, భోజగాని హుళక్కయ్య, మేడా సూర్యప్రకాశరావు, కొండ్రికొండ పుల్లయ్య, కుంభా జాన్ వీరయ్య ప్రభృతులు పాల్గొన్నారు.

### వుయ్యూరు

పట్టణ పోపలిస్టులు సత్తా రాజారావుగారి అధ్యక్షతను సమావేశమై నూతన కార్యదర్శిగా గోగినేని వెంకటేశ్వరరావు, కార్యవర్గ సభ్యులుగా చెరుకూరి గాంధి, చేవూరి వెంకటేశ్వరరావు, గోవిందరాజుల సత్యనారాయణ, కె. అంజిరెడ్డి, ఎం. డి. యూసఫ్, సిద్దాబత్తుల శివన్నారాయణ గార్లను ఎన్నుకొన్నారు.

### భీమవరం

లార్డ్ హార్డింజ్ టౌన్ హాలు సభ్యులు యిటీవల శ్రీపర్తి గంధం వెంకయ్యనాయుడుగారి అధ్యక్షతను సమావేశమైనారు. క్రొత్త పాలకవర్గ అధ్యక్షుడుగా డిప్యూటీ కలెక్టరు శె. ఎ. అంబాశంకర్, ఉపాధ్యక్షుడుగా నాదిరాజు జగన్నాథరాజు, కార్యదర్శిగా ... గార్లు ఎన్నికైనారు.

# రాష్ట్రమంతటా ఆంధ్ర దీక్షాదినోత్సవాలు

(1 వ పేజీ తరువాయి)

చంద్రగుప్త, చెరుకూరి వీరభద్రరావు నాయుడు, జనాబ్ జలీబ్ సాహెబ్ శ్రీమతి మాగంటి కౌసల్యమ్మ మున్నగువారు ఆంధ్రరాష్ట్రమును గురించి మాట్లాడారు.

## మదరాసు

గిండీ ఇంజనీరింగు కళాశాల ఆంధ్ర సాహితీ సమితి ఆధ్వర్యాన సుందర రామిరెడ్డిగారి అధ్యక్షతన యీ 9 వ తేదీన జరిగిన సభలో స్వామీ సీతారాం ప్రభృతుల ఉద్యమాన్ని బలపరుస్తూ ఏకగ్రీవంగా తీర్మానించారు. రాష్ట్ర సాధన విషయంలో నాయకులు తమ నిజాయితీని ఋజువుపరచుకోవలెననీ, హెచ్చరిస్తూ ఆంధ్రనాయకులలో ఏకగ్రీవం లేకుండుటే రాష్ట్ర నిర్మాణమునకు అభ్యంతరమని చెప్పుట సబబుగాదని, ఆంధ్రప్రజానీకమంతా ప్రత్యేక రాష్ట్రమును వాంఛించుచున్నదని, యీ యదార్థమును గ్రహించి, భారత ప్రభుత్వం వెంటనే రాష్ట్రాన్ని నిర్మించి స్వామీజీ ప్రాణమును కాపాడవలెనని కోరుతూ తీర్మానించబడినది.

## తెనాలి

స్థానిక పత్రికా రచయితలు ఆవుల గోపాలకృష్ణమూర్తిగారి అధ్యక్షతన, తాలూకా హైస్కూలు ఉపాధ్యాయులు హెడ్మాష్టర్ బి. శివరావుగారి అధ్యక్షతన సమావేశమై సత్వరం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మాణానికి అంగీకరిస్తు స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాణాలను కాపాడవలెనని భారత ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. రాష్ట్రదీక్షాదినోత్సవసందర్భాన యీ 9వ తేది సాయంకాలం 6 గం॥లకు మునిసిపల్ లైబ్రరీవద్ద చైర్మన్ నన్నపనేని వెంకట్రావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. స్థానిక కాంగ్రెసు వాసులు బ్రహ్మండం నరసింహం, గుళ్లపల్లి రామకృష్ణయ్య, రావి సత్యనారాయణ, నల్లబాటి వెంకట్రామయ్య, మల్లాది దేవేంద్రుడు మొదలగువారు రాష్ట్రనిర్మాణావశ్యకతను గురించి ఉపన్యసించారు. స్వామీ సీతారాం ప్రభృతుల ప్రాయోపవేశంపట్ల సానుభూతి ప్రకటిస్తూ ప్రభుత్వం వెంటనే ఆంధ్ర రాష్ట్రమును యేర్పాటు చేయాలని కోరుతూ సభలో తీర్మానించారు.

## మంగళగిరి

గాంధిచౌకులో పి. యస్. రామారావుగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభకు 10 వేలమంది వచ్చారు. సభలోపలువురుఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను గురించి ఉపన్యసించారు. అక్టోబరు 2 నాటికి ఆంధ్రరాష్ట్రమును యేర్పరుస్తామని ప్రకటిస్తు, స్వామి ప్రభృతుల ప్రాణాలను కాపాడవలసిందిగా భారతప్రభుత్వాన్ని అర్థిస్తు తీర్మానం చేయబడింది.

## విజయవాడ

అల్యూమినింలో వస్తువుల వ్యాపార మండలివారు స్వామి ప్రభృతులప్రాణాలను కాపాడుటకు తక్షణం పూనుకోండని భారత ప్రధానికి తంతి పంపారు.

## గుంటూరు

గుంటూరు, సెప్టెంబరు 9: ఆంధ్ర రాష్ట్ర దీక్షాదినోత్సవం యిచట చాలా జయప్రదంగా జరిగింది. పట్టణములోని అన్ని తరగతులవారు పాల్గొన్న పెద్ద ఊరేగింపు పట్టణ ముఖ్యవీధుల గుండా సాగిపోయింది. ఊరేగింపులో పాల్గొన్న పౌరుల నుద్దేశించి స్వామీజీ సత్య అహింసల మార్గము వీడక అత్మ విశ్వాసంతో యీ మహాయజ్ఞం జయప్రదంగా కొనసాగించాలని అంగుకువలసిన త్యాగమునకు సిద్ధముకావాలని ప్రబోధించారు.

ఎడ్లను పూన్చి బాగా అలంకరింపబడిన రథంమీద ఆంధ్ర భూభాగము, తెలంగాణా ప్రాంతముకల పెద్ద పటమును యేర్పాటు చేశారు. అనేకమందీ యువకులు 'ఆంధ్ర మాతకుజై' 'స్వామీసీతారాంకుజై' 'ఆంధ్రరాష్ట్రము వెంటనే స్థాపించాలి' 'ఆంధ్రరాష్ట్రముకొరకు సత్యాగ్రహముచేయాలి' అను నినాదములతో యీ రథోత్సవం సాగింది. ఈ ఊరేగింపు ఆంధ్ర మహాయాజ్ఞశాలకు చేరునప్పటికి సుమారు 12 గంటలయింది.

కొలినపాకను గ్రామాలలో స్వామి సీతారాం ఉద్యమాన్ని బలపరుస్తూ ప్రచారంచేసుకొంటూ అనేకదళములు ఊదయం యిచటకు వచ్చి చేరాయి. ఈ దళాలలో సత్తెనపల్లి నుండి 10 మంది, రేపల్లెనుండి 15 మంది, వినయాశ్రమం నుండి 25 మంది, గంజైవల్లూరు నుండి 5 మంది, తెనాలినుండి 60 మంది ఉన్నారు. విజయవాడ నుండి సుమారు 100 మంది మధ్యాహ్నం రైలులో దిగి ఊరేగింపుగా వచ్చి నినాదములు చేసుకుంటూ స్వామివారికి తమ కృతజ్ఞత తెలిపారు. తామంతను ఆంధ్ర రాష్ట్రము కొరకు యెట్టి త్యాగమైనా చేసి సత్యాగ్రహముచేయుటకై సాసిద్ధంగా నున్నామని వాగ్దానము చేశారు. వారువారు చేసిన తీర్మానాలు స్వామి వారికి సమర్పించారు. శ్రీ ప్రకాశ చంద్ర శెలిపతి, బసవరాజు, శ్రీ రంగశాయిగార్ల నాయకత్వమున యీరోజు విజయవాడలో ఊరేగింపు అయిన తరువాత దుర్గకులేలో స్వామివారి పేరిట సంకల్పం చేయించి, ఉపవాస వ్రతమును పూని అచ్చట బహిరంగ సభ చేసి తీర్మానములు చేసి స్వామివారికి సమర్పించారు.

పశ్చిమ గోదావరిజిల్లా మహిళా సంఘం తరఫున శ్రీమతులు మూల్పూరు

# నెహ్రూ సూచన

(1 వ పేజీ తరువాయి)

ప్రాయోపవేశం విరమించమని లోంగదీయటం కంటే, ప్రజానీకాన్ని పురెక్కించి, రాగల విపర్యాసాలను గూర్చి ప్రభుత్వానికి హెచ్చరికలు చేయటం మంచిదని స్వామీజీ సవినయంగా సమాధానం చెప్పతున్నారు. స్వామీజీ ప్రాయోపవేశ మారంభించి నేటికి 28వ రోజులు.

## ఆలపాటి వెంకట్రామయ్యగారి లేఖ

ఇంత ముదిప్రాయంలో పట్టుదీసిక స్వామీజీ ప్రాయోపవేశం కొనసాగిస్తున్నందుకు తామంతా ఆందోళన పడుతున్నామని గుంటూరుజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు ఆలపాటి వెంకట్రామయ్యగారు స్వామి సీతారాంకు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణావశ్యకతను గుర్తించి వున్న కారణంగా, అంతి తొందరలో కాకపోయినా, ఆంధ్ర రాష్ట్రం ఏర్పడి తీరుతుందనే నమ్మకాన్ని వెల్లడించారు. ప్రాయోపవేశం విరమించి, స్వామీజీ ఆదేశించగల కార్యక్రమాన్ని అనుసరించటానికి తామంతా సిద్ధంగా వున్నామని ఎరుకపరిచారు.

## స్వామిజీకి విరాళాల సమర్పణ

కృష్ణాజిల్లా మోటారు పనివారల సంఘ కార్యదర్శి బాపరాల బహ్మనందంగారు స్వామీజీని సందర్శించి బస్సు ప్రయాణీకులు, తాము, తదితరులు విరాళాలుగా యిచ్చిన రు. 250/-లను ఆయనకు సమర్పించారు. ఈ ఉద్యమంలో ఏ సాయం కావాలన్నా చేస్తామని తమ యూనియన్ తరఫున బ్రహ్మనందంగారు స్వామీజీకి హామీ యిచ్చారు.

రాజమహేంద్రవరంపురపాలక సంఘాధ్యక్షుడు డా॥ ఏ. బి. నాగేశ్వర రావుగారు తాము వ్రాసిన లేఖలో స్వామీజీకి అనుకూలమని తోచినవిధంగా వినియోగించటానికి తూర్పు గోదావరిజిల్లా తరఫున రు 5000/-లను 5వేల మంది సత్యాగ్రహులను సమాయత్తం చేయగలమని తెలుపుతూ, సత్యాగ్రహ మారంభించ వలసిందిగా కోరారు. పోతిన వెంకయ్య (కౌరంచేడు) గారు స్వామీజీకి రు100/-లు సమర్పించారు.

స్వామీజీ ఉద్యమాన్ని బలపరుస్తూ గుంటూరు జిల్లా క్రైస్తవులు తమ హాస్నూరు సమావేశంలో చేసినతీర్మానాన్ని గూర్చి ఆ సభాధ్యక్షుడు ఎస్. పాలస్ గారు స్వామీజీకి నిన్న తెలియచేశారు.

రాష్ట్ర సంపాదనకై సత్యాగ్రహం ప్రారంభించినట్లైతే తామంతా స్వామీజీఅండన నిలబడి సంపూర్ణంగా తోడ్పడుతామని హామీయిస్తూ దేశం నలుమూలలనుంచీ, స్వామీజీకి లేఖలువస్తున్నవి.

సర్వోదయ సమాజంలోని స్త్రీ సభ్యురాలు ఒకరు తాను, పండిత జవహర్ లాల్ నెహ్రూను కలుసుకొన్నాననీ, స్వామీజీ ఉద్యమఫలితంగా యేర్పడిన తీవ్రపరిస్థితిని ఆయనకు నచ్చచెప్ప గలిగాననీ స్వామీజీకి లేఖవ్రాసింది. తనపేరు వెల్లడించదలచలేదని ఆమె తనలేఖలో తెలిపింది.

ఈ 16 న యిక్కడ ఆంధ్ర శాసన సభాసభ్యుల, స్థానిక సంస్థల అగ్రస్థుల సమావేశ సన్నాహం ద్విగుణీకృత ఉత్సాహంతో సాగుతున్నది. యీ సమావేశంలో పాల్గొనే కార్యకర్తలందరికీ విడివిడిగా ఆహ్వానాలు పంపజాలకున్నామని అందరూ తప్పక రావలెనని స్వామి సీతారాం గారు కోరుతున్నారు. ఈ సమావేశానికి హాజరై, అందు జరిగే నిర్ణయాలకు బద్ధులమై ఉంటామని, అనేక స్థానిక సంస్థల సభ్యులు లేఖలు వ్రాశారు.

## పురపాలక సంఘ సభ్యుల రాజీనామా

గుంటూరు పురపాలక సభ్యులంతా కలసి కట్టుగా త్వరలోనే రాజీనామా యివ్వ నిశ్చయించుకొన్నట్లు యాథిగా తెలుస్తున్నది. నిన్న విజయవాడ పురపాలక సంఘాధ్యక్షుడు తెన్నేటి చలపతిరావుగారు కౌన్సిలర్లు విష్ణువర్ధనరావు, బుద్దూస్, సిరిపురపు కోటేశ్వరరావుగారిలు, తమ రాజీనామాలను నిన్న ప్రార్థన సమావేశంలో స్వామి సీతారాంకు అందజేశారు. స్వామీసీతారాం నిన్న ప్రార్థన సమావేశంలో ప్రసంగిస్తు రాష్ట్రోద్యమం ఫలిస్తున్న సూచనలు కన్పిస్తున్నవని ఇది సర్వోదయ పద్ధతికి అఖండ విజయమని అన్నారు.

వెంటనే ఆంధ్ర రాష్ట్రం యేర్పాటుచేయకపోతే త్వరలోనే విషమ పరిస్థితి యేర్పడుతుందని ప్రజా సంస్థలనుండి, ప్రభుత్వోగాల నుండి రాజీనామాలు యివ్వడం సంభవించ వచ్చునని, ఆంధ్రుల ఉద్యమం చాలా పురాతన మైనదనీ, యికెంత కాలము ఓపిక పట్టడం అసంభవమని, తాము క్రితం నెల 10వ తేదీ మద్రాసు ముఖ్య మంత్రికి చెప్పినట్లు స్వామీ సీతారాం వెల్లడించారు.

---

ముక్కామల్ల, మువ్వలసేని పుష్కరాంబ, కన్నెగొర్ల అంజాళీదేవి, ఉల్లగంటి సౌభాగ్యవతి, మోతే వేదకుమారి, వెంకట లక్ష్మిరెడ్డిగార్లు వచ్చి తమ కృతజ్ఞతను స్వామికి తెలియ జేశారు.

తెనాలి నుండి శ్రీ రాజర్షిగారి నాయకత్వాన ఆంధ్రరాష్ట్ర సర్వోదయ సత్యాగ్రహ సమర సంఘంవారు ఆంధ్రరాష్ట్రముకొరకు తాము సత్యాగ్రహం చేయుటకు సిద్ధంగా నున్నామని వెల్లడించారు.

రాష్ట్ర నిర్మాణం విషయంలో జరిగే విలంబనకు అసమ్మతి సూచకంగా ఆంధ్రమంత్రులుకూడా రాజీనామా యిచ్చే రోజు వస్తుందని అన్నారు. అయితే కేవలం గాంధి మార్గంలో తాను చేసే ప్రయత్నాల వల్ల త్వరలోనే ఆంధ్రులకు ఆశయం ఫలించగలదని స్వామీజీ ఆశించారు.

స్వామీసీతారాం ప్రభృతులు 7 గురే కాక సెప్టెంబర్ 1నుండీ, మరి ముగ్గురున్నూ, వారంరోజుల నుండీ మరి ఆరుగురున్నూ ప్రాయోపవేశం చేస్తున్నారు.

## చేనేత కాంగ్రెసు తరఫున 5 వేల సత్యాగ్రహులు

చీరాల, సెప్టెంబరు 12: స్వామి సీతారాంగారు ప్రాయోపవేశం విరమించి సత్యాగ్రహ చర్యలను వుపక్రమిస్తే చేనేత కాంగ్రెసు తరఫున 5000 మంది సత్యాగ్రహుల్ను సమర్పించటానికి సిద్ధంగా వున్నామని చేనేత కాంగ్రెసు కార్యదర్శి ప్రగడ కోటయ్య నిడుబ్రోలులో ఆంధ్ర దీక్షాదినం సందర్భంలో తెలియ చేశారు. సభవారు సత్వర ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఆకాంక్షిస్తూ ఏకగ్రీవంగా తీర్మానం చేశారు.

## ఆంధ్రరాష్ట్ర వ్యతిరేకవాదుల ఆందోళన

అనంతపురం, సెప్టెంబరు 12: నిన్న నిక్కడ సమావేశమైన రాయలసీమ స్నేహ బృందంవారు ఆంధ్ర రాష్ట్ర విభజన జరుగరాదంటూ ఒక తీర్మానం చేశారు. ప్రాయోపవేశాలకూ, సత్యాగ్రహాలకు బెదరిపోవద్దని పండిట్ నెహ్రూను, భారత పార్లమెంటునూ బ్రతిమాలారు. ఆర్థికంగా సాధ్యమైతేనే కాని ఏరాష్ట్ర విభజనమూ జరుగరాదనేది రాయలసీమవారి అభిమతమనీ అంటూ, తీరప్రాంత ఆంధ్రులు ఏలాగో ఒకలాగున రాష్ట్రం సంపాదించాలని ఆతురతపడుతున్నట్లు విమర్శించారు.

# ఫక్తూనిస్థాన్ ఉద్యమం

(2 వ పేజీ తరువాయి)

నాలను క్రోడీకరించి మీరు పంపారు; కాని ఆ ప్రకటించబడిన వార్తలకు వ్యాఖ్యానాలకు మీరు పంపిన అనువాదాలకూ చాలా భేదంవుంది. ఇవి తప్పుడు అనువాదాలు అవటం అలా వుండగా, వీటివల్ల స్పష్టంగా తేలుతున్న ఒకవిషయం ఏమిటంటే, ఆలిండియా రేడియో వ్యాఖ్యానాల కంటే వార్తలనే ముఖ్యంగా ప్రసారం చేసింది అని. పోతే మీరు పంపిన వ్యాఖ్యానాలను తిరచి చూసినా, అందులో భారత ప్రభుత్వానికి తప్పేమీ కన్పించడంలేదు. ఈ వ్యాఖ్యాతలు అంటున్నదల్లా ఏమిటంటే, కాశ్మీర్ విషయంలో ప్రజలకు స్వయం నిర్ణయాధికారం కావాలని పట్టుపడుతున్న పాకిస్తాన్ ఫక్తూనిస్తాన్ విషయంలో ఆ మాటమీద ఎందుకు నిలబడడంలేదు? అని. ఇంతా చూస్తే, డిసెంబరు 14 వ తేదీనాటి ఒడంబడికను ఇండియా భగ్నం చేసిందనడానికిగాని, అంతర్జాతీయ న్యాయశాస్త్రప్రసక్తి లేవడానికిగాని ఇందులో ఆస్కారం ఏమీలేదు.

పాకిస్తాన్ పత్రికలూ పాకిస్తాన్ రేడియో ఈమధ్య చేసిన కొన్ని అసత్య ప్రచారాలను ఈ సందర్భంలో మీ దృష్టికి తేవడం అవసరం. అని ప్రభుత్వం భావిస్తున్నది. ఇండియా ప్రేరణవల్లనే ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వం ఈ ఫక్తూనిస్తాన్ ఉద్యమాన్ని బలపరుస్తున్నదని ఈ ప్రచారం యొక్క సారాంశం. ఇట్టి అసత్యమైన ఆరోపణలను చేస్తున్నందుకు భారత ప్రభుత్వం తీవ్రంగా అధిక్షేపణ తెలుపగోరుతున్నది. నేపాలు టిబెట్టు, చైనాలకూ, ఇండియాకు వున్న పరస్పర సంబంధాల గురించి జరుగుతున్న ప్రచారం చూసినా, ఇదే ధోరణిలో వుంటున్నది. ఇరుగుపొరుగు రాజ్యాలతో ఇండియా స్నేహసంబంధాలను చెడగొట్టి పొరుపులు పెట్టాలన్నదే పాకిస్తాన్ అభిప్రాయం అయివున్నట్లు ఈ ప్రచారంవల్ల స్పష్టమౌతున్నది.

ఇటువంటి ప్రచారం చేయడంలో పాకిస్తాన్ ఉద్దేశ్యం ఏమైనా ఇండియా యెడ స్నేహభావంతో చేస్తున్నదని మాత్రం అనుకోవేందుకు సావకాశం కనిపించడంలేదు" అని భారత ప్రభుత్వం హెచ్చరిక చేసింది.

# తక్షణం ప్రాయోపవేశం విరమించండి

(1 వ పేజీ తరువాయి)

వదలి, యిప్పుడు ప్రదేశ్ కాంగ్రెసు ఆధీనమందున్న భూభాగాన్నే రాష్ట్రంగా నిర్మించవచ్చు. యీ సర్వసైకోపబకునని తద్వారా ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చెయ్యబడునని ఆశిస్తున్నాను."

## శ్రీ కామరాజనాడార్ అభిప్రాయం

మద్రాస్, సెప్టెంబరు 12 "ఆంధ్రులు మద్రాసు వదులుకున్నట్లయితే ఆంధ్రరాష్ట్రం చాలా సులభంగా వస్తుంది. ఇంతవరకు నాకు కనిపించిన పరిస్థితిలో మార్పేమీ కనిపించలేదు" అని తమిళ కాంగ్రెసు అధ్యక్షులు కామరాజ నాడారుగారు నిన్న సాయంత్రం పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సందర్భాన పండిత నెహ్రూతో తాముమాట్లాడామని, మద్రాసు, ఆంధ్రులు వదులుకుంటే ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తమిళులు ఇదివరకే అంగీకరించి

ఉన్నారనీ, నాడారుగారు చెప్పారు.

## ఆంధ్రప్రదేశ్ కార్యదర్శి ప్రకటన

మద్రాసు, సెప్టెంబర్ 12: ఆంధ్ర నాయకు లందర్నీ సంప్రదించకుండా స్వామీజీ ప్రాయోపవేశదీక్షకు పూనుకున్నా, వారి ప్రాయోపవేశంవల్ల ఆంధ్రోద్యమానికి ఒక నూతనోత్తేజం కలిగింది. అందుకు స్వామీజీకి ఆంధ్రులంతా ఎల్లకాలమూ కృతజ్ఞులుగా ఉండగలరు. తమను దీక్షను విరమించమని మేము అడగటానికి బదులు నెహ్రూను రాష్ట్రం మేము అడగవలసిందిగా స్వామీజీ అంటున్నట్లు వింటున్నాము. మేమూ ఒకవంక స్వామీజీని, వారి శిష్యుల ప్రాణాలకు కాపాడుకోవాలనే కాంక్షతో వారిని ప్రాయోపవేశాన్ని విరమింప గోరుతున్నాము. మరోవంక పండిత నెహ్రూనుచూచి ఆంధ్రుల చిరవాంఛితమైన ఆంధ్రరాష్ట్రాన్ని ఇవ్వవలసిందని ఉత్కంఠతో అర్థించాము. ఆయన ఆంధ్రరాష్ట్రం అంటే ఇదివరకు ఎన్నడూ చూపించనంత ఉత్సాహాన్ని, ఆసక్తిని, సమతాహాలాన్ని ప్రదర్శించారు. అంతేగాక అన్ని విధాలా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తాము అనుకూలురమేనని మాకు అరమరలేకుండా తెలియజేశారు. ఇది ఎంతకాలం ఇల్లా ఉండటనే విసుగు ఆయనకు కల్గింది. మాయీ అనుభవాన్ని స్వామీజీ గ్రహించి, ప్రాయోపవేశాన్ని విరమించి, శిష్యులచేత విరమింప చేయాలనీ ప్రార్థిస్తున్నాము." అని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యదర్శి అల్లూరి సత్యనారాయణ రాజుగారు నిన్న రాత్రి ఢిల్లీనుండివచ్చిన తర్వాత ఆంధ్రపత్రిక ప్రతినిధికి చెప్పారు.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 12.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటకు నవరసు 1-కి ఎక్స్ఛేంజితోమ్మ పేల్చుటాక్సుతోసహా రు. 78.0.0 మేలుబంగారు తులం 112.0.0 మూన బంగారు 109-12-0 పీమవెండి తులం 100-కి (కడి) 190-8.0 వెండి తులం 1-కి 1.15.0.

వేరుశెనగ: (531 పౌ 1-కి ఎక్సుకోస్తా గిడ్డంగుల మెషిన్ - పేల్చుటాక్సుతో సహా)

| | |
|---|---|
| కడిరి | రు. 180 182 నా |
| వేరుశెనగనూనె ఎక్సుపెల్లర్ ఖిలో 3% | |
| నామినల్ (500 పౌ.) | రు. 350, 351 |
| కొబ్బరి మూనె (37½ వీసెలు గల డబ్బా) ఒకటి- | |
| క్విలాన్ | రు. 39-12-9 |
| కాలికట్ యస్. బ్రాండ్ | 39-14-9 |

ఆముదం

| | |
|---|---|
| 500 వీసెలు గల బారువ ఒకటికి | |
| "తిరుపత్తూర్" | రు. 420-0-0 |
| నరసారావుపేట" | రు. 430-0-0 |



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.